ప్రథమ ముద్రణ
వెయ్యి ప్రతులు

ముద్రణ
నాట్యకళ ప్రెస్
హైదరాబాద్

*        *        *

ముఖ చిత్రం
యస్. సత్యనారాయణ

*        *        *



*        *        *



*        *        *

ప్రతులకు:
పోతుకూచి ఏజన్సీస్
208, మ్యా బోయిగుడ, సికిందరాబాద్
ఫోన్: 7 3 4 7 7

## చూడండి!

"పల్లె కదిలింది" నీ మనస్సులో ఎలా మెదిలింది? ఎందుకు కదిలింది? ఎవరు మెదిపింది? అనగలరు — యీ నాటకం చదివాక. పాఠకులందరికీ నచ్చక పోవచ్చు - నటకు లందరూ హర్షించక పోవచ్చు - అసలు గ్రామీణులే నేడు మాలో యీ పరిస్థితులు దూరమయ్యాయి అనవచ్చు — అంటేనేం - స్త్రీ సాహిత్యం కాదు కనుక - నటనా చమక్కులు లేవు కనుక - చారిత్రాత్మక — నాటకం యిది గనుక — అనినా సమాధానం.

ఎవరు చదివినా ఒక విషయం కాదన లేరు. అంతర్గత విభేదాలవల్ల, అంతరాంతరాల తారతమ్యాల వల్ల ఏ సమాజమైనా అధోగతికి దిగజారుతుం దన్నది విశ్వ జనీన సమ్మతమైన నుడి. ఇది యీ నాటకంలో ప్రతి ధ్వనిస్తుంది.

భారతదేశం గ్రామాల భూమి. చరిత్రగాని. ప్రభుత్వంవారి జనాభా లెక్కలుగాని, నిత్యం మన హృదయంలో రంగరించి పోసేది మన దేశంలోని జనాభాలో అత్యధిక సంఖ్య గ్రామీణులే అని. కాని గ్రామీణులందరూ జీవనోపాధికి పట్టణాలు తరలి వస్తున్న నేడు

యీా సిద్ధాంతం అమలు జరుగుతున్నదా! అమలు జర పాలనే తాపత్రయం మాత్రం వుంది. ఉద్దేశం నిజా యితీతో కూడి వున్నదే-కాని ఫలితాలు దురూహ్యంగా మారి పోతున్నాయి.

నేడు మన గ్రామీణ దేశంలో పంచాయతీ రాజ్ వర్ధిల్లుతోంది. గ్రామంలోని ప్రతీ వ్యక్తి నేటి పరి పాలనలో స్ఫుటమైన భాగస్వామి. ఇది తెలియ పరిచి గ్రామాల నభివృద్ధి చేయడమే పంచాయితీ రాజ్ ఆశ యం. దీని ఫలితం వేరు, గ్రామీణులలో పదవీ కాంక్షాయుద్ధాలలోని రాజకీయాలు నరనరాల జీర్ణిం చుకు పోతున్నాయి. గ్రామాభివృద్ధి కంటె గ్రామ సింహాల కొట్లాట అభివృద్ధి పెరుగుతోంది. ఇటువంటి సిద్ధాంతాలు సిద్ధాంతాల రూపంలో సృజనాత్మక నాట కంగా రాస్తే రాయవచ్చు-కాని రాణి చదు. మూల సూత్రాలు ప్రతిబింబిస్తూ సర్వజన హార్దదాయకము, సమ్మతము అయిన పాత్ర సృష్టిద్వారా సిద్ధాంతాల ప్రవచనం, సంఘటనల గమనంలో వినిపించాలి. అటు వంటి ప్రయత్నమే యీా "పల్లె కదిలింది"!

సాహిత్య విమర్శకులు తమ తీవ్ర తర దృక్పథం ప్రయోగించి కొంత సాహిత్యాన్ని ప్రచార సాహి త్యంగా చలామణీ చేసి "పనికిరాని ముద్ర" ఒకటి వేస్తున్నారు. రాజకీయ ఆర్థిక సిద్ధాంతాలు పంచవర్ష ప్రణాళికలు. సాంఘిక ఉద్యమాలు—వీటి ఆధారంగా వెలువడిన సాహిత్యం ఒక విధంగా ప్రచార సాహిత్య మని. దాని ప్రయోజనమంతా తాత్కాలికమని కొట్టి

పొర వేస్తున్నారు. కాని అది పొరపాటు. చరిత్రను పరి శీలిస్తే సాహిత్యాన్ని నిష్పాక్షికంగా విమర్శిస్తే, ప్రతీ రచనా ప్రచార సాహిత్యమే. ప్రేమ ప్రచారం, సంసార సుఖ ప్రచారం, గ్రామాభివృద్ధి ప్రచారం, హరిజనా భ్యుదయ ప్రచారం హత్యా (పరిశోధన) ప్రచారం- అధునిక నాగరికతా ప్రచారం — ఇలా ప్రతీ అంశం - బలంగా హృదయాన్ని హత్తుకున్న ప్రతీ అంశం—ఆధా రంగా ప్రచారం జరిగిందని వాదించవచ్చు-నిజంకూడా అంతే. అయితే ప్రచారం లేని సాహిత్యము, సాహి త్యమే కాదు. కాని ప్రచార ధోరణి ప్రదర్శనలోనే రచయిత ప్రతిభ గోచరిస్తుంది. సిద్ధాంతాలు సంభా షణల్లోనూ, ఉద్యమాలు ఘర్షణలోనూ, ఉద్రేకాలు ఊరేగింపులలోనూ, బహిరంగంగా నాటకంలో చూపే పద్ధతికంటె సృజనాత్మక రీతి పాత్ర చిత్రణలో, కథా గమనంలో, వాతావరణ సృష్టిలో, లోలోతుగా ప్రచార సిద్ధాంతాలు అంతర్లీనమై సహజ సాంఘిక లేక చారిత్రక స్థితిగతులు ప్రతిబింబించేలా హృద యంగమంగా సాగిన రచన ప్రత్యేక సాహిత్య విలువ లతో రాణిస్తుంది. ఇదే ప్రయత్నం యీ 'పల్లెకదిలింది'లో నే చేశాను.

అధునిక నాటక రంగం క్రొత్త సాంకేతిక రీతులు గమనించిన విమర్శకులు యీ నాటకంలోని సభా దృశ్యాలు ప్రదర్శన యోగ్యమా అనవచ్చు కాని సభల మాదిరిగా వాటిని ప్రదర్శించే కంటే, గుంపులు గుంపులుగా సంఘటిత ప్రజావాహిని, వ్యక్తీకరించుతూ

ఆ రంగాలు ప్రదర్శించాలని నా కోరిక. గుంపులు గుంపులుగా రంగం మీద కనిపించినా, ప్రతి గమనం నిర్దుష్టంగా నిర్ణయించబడాలి.

మునలయ్య పాత్ర కథాగమనానికి జీవన తంత్రిగా మ్రోగాలి, అది ఉదాహరణగా గుర్తించి గ్రామం అభ్యుదయంతో సాగాలి. తరతరాల గతి దప్పిన మతి మాలిన పనులు నేటి తరాన్ని పీడించరాదు. మనుష్యుల్లో మమతలు – మమతల్లో తలపులు తలుపుల్లో కలుపులు– వెల్లి విరిసినపుడు, సంఘటిత శక్తితో క్రొత్త పంటలతో శుభోదయంతో అలరారి పల్లె కదులుతుంది!! పల్లె కదలనీయండి!

చూడండి!

ఇదీ "పల్లె కదలింది."

**పోతుకూచి సాంబశివరావు**

నాటకం ప్రదర్శించే వారు దీనిని వ్యాఖ్యానంగా ముందు చదవండి! —రచయిత

# పల్లె కదిలింది

ఇందులోని పాత్రలు :

ముసలయ్య, వెంకటాద్రి, ఎల్లారెడ్డి, చిలకన్న, గుండయ్య, పుష్ప, కనకరెడ్డి, సూర్యం, గవరయ్య, భూమన్న, 'నరసింహం, శేషాచలం, తదితరులు.

# అంకితం

మేరునగగభీరుడు
బాపూజీ అడుగుజాడల
నిరతం వర్తించే లక్ష్మణుడు
నిత్య జనతా సేవాతత్పరుడు
ప్రజా జీవన సమస్యల
కీకారణ్యాల
దాగొని భయంకరంగా గర్జించే
దారుణ దుష్టశక్తి శూర్పణఖల
కర్ణనాసికల కోసిన
ఘన రాజకీయశూరుడు

గతించిన చరిత్రల పాలనలో
గజగజలాడే ప్రజానీకానికి
విప్లవ వేడి నెత్తురులు
చవి చూపించిన
స్వతంత్ర వీరుడు
మాటలోనే మనసు కలిపి
మమత చిలికి మదిని కదుపు
మహామనీషి, నిండుకొండ
ఆయన
కొండా లక్ష్మణ్ బాపూజీ
అందుకే మా ఆయన
అంది "పల్లె కదిలింది"
పల్లె కదిలింది
మనసు పల్లవించింది

iii

పల్లెలు చైతన్యంతో
కదలడమే కలకల లాడడమే
బాపూజీ ధ్యేయం
మన లక్ష్మణ్ బాపూజీ ఆశయం.
పల్లె పల్లె కదులు అందం
భరతజాతి ప్రతిబింబం
శాస్త్రం పెరగనీ, శస్త్రం మారనీ
భరతజాతి జీవన విధానాల
తరతరాల సంస్కృతి నింపి
బిరబిరాన నడిపించే మూలం
తరగని అన్నపూర్ణ మన గ్రామం
అది కదలాలి
నిత్య చైతన్యంతో

ఇది సత్యం—

అధః పతన జీవన గతుల

పథం నుంచి తప్పించి

మనిషి శక్తి కుప్పించి

మంచి చూపి బ్రతకాలి

ఇదే

పల్లె కదిలింది

మన బాపూజీ

మనసు కదిలింది

మనసు కదిపింది

మనసు పొందింది

పల్లె కదిలింది

మనసు పల్లవించింది.

# పల్లె కదిలింది

## మొదటి రంగం

(రావిచెట్టు-గుడిసె-ఒక రాతిమీద కూర్చుని
తంబురా మీటుకుంటూంటాడు ముసలయ్య
అట్టలుగట్టిన తెల్ల శిరోజాలు - పొడుగాటి
గెడ్డం-చిరుగు చొక్కా-పంచ-ముడుతలుపడిన
శరీరం-దృష్టి సన్నగిలుతున్న కళ్లు-దూరాన
అల్లిబిల్లిగా మొలిచిన మొక్కల తుప్పలు)

ముసలయ్య :

పులకరించిన ప్రకృతి-పులకరించిన ప్రకృతీ!
నీ ఎదదయే నాకు-నిలయమై నిలిచింది
కదలిపోవు తరాల-కలతలా పతనాల
కడపటి చిహ్నమై-కలిసిపోవుదు నీలో ||ప||
ఆరు ఋతువుల కాల మరుదెంచె పరుగెత్తె
రంగురంగుల ఆకు రాలిపోయెను ఎంతో ||

(ఎల్లారెడ్డి-సిల్కులాల్చీ-మల్లుపంచ- గిరజాల
జుట్టు-ఆకుచెప్పులు - మెడలో పట్టుఅంచు
కండువా-చేతిలో-శీపిగా చుట్ట కాల్చుకుంటూ
వస్తాడు. ఒకవైపునుంచి-మరొకవైపు-వెంక

టాద్రి-మోకాలుపైకి కట్టిన పంచ, బనీను, సగంచెక్కిన తల-చేతిలో బరువైన సంచీ-కంటికి పాత కళ్ళజోడు-వెంకటాద్రి ఎల్లా రెడ్డివైపు చూస్తూ నడుస్తాడు-ఎల్లారెడ్డి ఏదో ఆలోచిస్తూ అతనిని దాటి గబుక్కున ఆగి పిలుస్తాడు-ముసలయ్య తంబురా మీటులు వినిపిస్తోంటాయి)

ఎ : ఏమోయి ! వెంకటాద్రి !

వెం : రెడ్డిగారు ఆలోచన తీవ్రతలో అందరినీమరిచి పోతున్నారు !

ఎ : తెగని ఆలోచన పగటిని రాత్రి చేస్తుంది. అందుచేత చీకట్లోలా చుట్టూ ఏమీ కనిపించ టం లేదు. ఎక్కడికి ప్రయాణం ?

వెం : మామూలే, ఊళ్ళో పెత్తనానికి.

ఎ : ఎంతమందికైనా ఉద్యోగాలు మారుతాయిగాని, నీ ఉద్యోగానికి మాత్రం మార్పు లేదను కుంటా.

వెం : నాలాంటివాళ్ళు ఉండబట్టేగా, మీలాంటి ప్రభు వులు హాయిగా బ్రతుకుతున్నారు !

ఎ : (నవ్వి) ఊఁ, భూమన్నని కలిశావా యీ మధ్య.

వెం : ఈ ఊళ్ళో నేను రోజూ కలియని మనిషి ఉన్నాడా? ఈ ఏడు పంటలు పండటంతో మీ అప్పు కాస్తా గిరగిరాతిప్పి ఏదో విధంగా మీమీదకు విసిరేస్తానన్నాడు. అబ్బాయిచదువు కూడా ఈ ఏటితో ఆఖరుగా... అతను చేతికి అందుకువస్తే, అంతా డబ్బే.... అంతా సంతోషమే... అప్పుడు మీ అప్పూ ఉండదు, మీ లెక్కా లేదు.

ఎ : ఇలా భూమన్న అన్నాడా?

వెం : వాడు అనకపోతే నేను అంటానూ? ఎవరైనా ఏదైనా అంటేనే, అది నేను అంటాను. మీకు తెలుసుగా!

ఎ : సరే, ఎందుకని యింతకాలం పెరిగే అప్పును తీర్చమని అడక్కుండా మంచితనం చూపిస్తూంటే, మనిషికి అర్థం కావటం లేదు. ఈ సారి చూస్తాడు ఎల్లారెడ్డి ప్రతాపం.

వెం : మీ ప్రతాపం దినదిన ప్రవర్ధమాన మవ్వాలని నా కోరిక. అది ఒక్కటే కాదు. ఇలాంటి భూమన్నలాంటి మనుష్యులు లక్ష మందిపై మీరు అధికారం చెలాయించాలని నా కోరిక. నా తెలివి మండిపోనూ. అసలు మీ తాత

ముత్తాతలకు ఎంత పరపతి ! ఎంత డబ్బు !! ఎంత హోదా !!! వాళ్ళు దానంచేసిన భూములే కదుటండీ యీ భూమన్నా వాళ్ళా పండించు కుంటున్నారూ ! మీ భూములు మీరు తిరిగి సంపాదించుకోవడంలో తప్పేముంది ! అన్ని రకాల పద్ధతులు అవలంబించవచ్చు ! సన్నాడ గండి, అన్నీ నే చెబుతాను.

ఎ : వెంకటాద్రి అసాధ్యుడని నాకు తెలియదా !

వెం : మీకు తెలుసుగా !

ఎ : భూమన్న భూమి అంతా టెనెన్సీ ద్వారా మన చేత చిక్కింది కాని ఆ నాగులచెరువు కావతల ఎకరం పల్లపు భూమి .

వెం : దానికి కాలం కూడిరావస్తుటండి! పిల్ల పెండ్లికి ఎదిగిందిగా ! ఆ అమ్మాయి పెండ్లి పేరు మీదుగా ఆ భూమి మదగ్గరకు రాకుండా ఉంటుందా ? ఈ ఏడాది మీరు తప్ప యింకో కళ్ళు అప్పు యివ్వాలంటే ఎన్నిగుండె లుండాలి ?

ఎ : సెభాష్-బాగా చెప్పావు వెంకటాద్రి! సాయంత్రం కలుసుకో! భూమన్నని ఒక కంట చూస్తూండు !!

వెం : అది నాకు ప్రత్యేకం చెప్పాలా ? మీకు తెలుసుగా ? (నిష్క్రమణ)

ము : మట్టినే మసిచేసే మనుష్యులా మనుగడ
పరతంత్ర పాపాల-బలి యెపుడు దాటునో
॥చిలకా॥

మదిమి ముడుతలలోని-చెదురు మనసుల
పెరుగు
మమతలా మాయలూ-భ్రమల బ్రతుకులుగాదె
॥చిలకా॥

ఏనాడు ఏగాలి ఏరీతి విసురునో
ఏ మార్పు పుడమిపై ఏ తీరు కలుగునో
॥చిలకా॥

(గుండయ్య-చిలకన్న - కూలీలు - చిలకన్నకు పొడుగాటి పిలక ఉంటుంది-అమాయకుడు-ఒక పంచె-బనీను, కాలికి ఒక వెండి కడ్డీ, గుండయ్య, బనీను, టర్కీష్ తువ్వాలు-లాగు, నీటు క్రాపు-వయసులోని మనిషి, ఒకరికొకరు ఎదురుగా వస్తారు)

గుం : ఏంరా చిలకన్నా !

చిల : మంచిగున్నావా గుండయ్యా ?

గుం : ఆఁ ఏదో ఉన్నా, మాజోరుగా వస్తున్నావు!
ఏందీ అంట కత!

చిల : కతాలేదు కామాసు లేమ. మన నాగులచెరువు
లేమా, ఆడకి మాంచి పిల్లవచ్చింది.

గుం : ఎవలేంద్రా! మా గుటకలేస్తుండవు!

చిల : అదే! నువ్వు చూస్తోఁహాచో! నీకే ఎరు
కయితది!

గుం : చెరువు ఎట్టున్నాది!

చిల : ఆపి మొకం! ఆడూ నేనూ ఊరు పెద్దయితే
యిట్టనే తగులడతాది! నాలుగేళ్ళసంది నాచు
పెరిగిపోయిందిగందా! మంచిగా చేయించా
లని ఎరకలేదా? కాలేస్తే జర్రున జారుతది!

గుం : నాచుగురించి కాదు పిల్లగురించి!

చిల : పిల్లకేందిరా! (హిహిహి) నాచు మాలావు
పెరిగి చెరవంతా పట్టుకున్నదిరా! చెరవులో
ఓ పువ్వు కాసొచ్చింది. కోద్దామనేసరికల్ల
జర్రుమని జారిపడి, లోన సస్తననుకున్నా.
కాని యీతవస్తదికదా మనకి, బయటికి
వచ్చేసినా.

గుం : మామంచిపని చేసినవులే.... ఆ పువ్వేవలకు?

చిల : ఉందిలే, దానికంత సానకత ఉన్నది. సే జారి పడ్డానా ! పొట్టపట్టుకుని అది నవ్వులురా !

గుం : ఓరు ?

చిల : ఓలేందిరా ? ఆ పిల్ల.

గుం : ఎవఱ్రా ఆ పిల్ల ?

చిల : అదేగా సెప్పినా ! యిసువంటి పిల్లకు పువ్వు యివ్వకూడదని, కోపంతో వచ్చేసినా !

గుం : మళ్ళీ నిన్ను పిలిచిందనుకో ఆ పిల్ల.

చిల : నేను పోను !

గుం : మాట్లాడించినదనుకో !

చిల : మాట్లాడను.

గుం : ఎమరుంగ వచ్చిందనుకో !

చిల : సూడనే సూడను.

(చేతిలో నీళ్ళబిందె పుచ్చుకుని వయ్యారంగా నడుస్తో పుష్ప నడిచిపోతుంది. గుండయ్య దాన్ని చూసి సకిలిస్తాడు. చిలకన్న కళ్ళు పెద్దవి చేసి అదేవైపు చూస్తాడు)

గుం: అరే సూడనన్నవాడివి మల్లా సూత్తున్నావేందిరా !

చిల : (హిహిహి) సూడబుద్దేసిందిగా. మామంచిగ ఉన్నదిరా సక్కనిసుక్క.

గుం: మాలావు బొక్కలు సదివిందటరా ! ఆయీది పిల్లలని పిల్చి సదువు సెపుతున్నదంట !

చిల : యీళ్ళకు బొక్క లెందుకురా ? సూద్దామంటే నాకు సిన్న కాయితం తప్ప ఏం దొరక దాయిరి.

గుం : సదువుకొని సన్నాసివి నీకూ నాకూ బొక్క లెందుకురా :

సూడసక్కని పిల్లరా
కొంటిసూపు పిల్లరా
హొయిలు హొయిలు పిల్లరా
ఓలమ్మో. సమ్మంజే.
ఓనవ్వ పిల్లరా ॥సూ॥

చిల : (హిహిహి కులుకు) బలేపాటలే ! బలే !

గుం : పెండ్లి చేసుకుంటావురా !

చిల: పెళ్ళా ! నేనా ! (హిహిహి) నన్ను చేసు కుంటాదిరా ! అయినా బోగంపిల్లని ఎవడు చేసుకుంటాడు ! నిన్ను చేసుకోమనరా !

గుం : నాకిప్పు డెందుకురా లగ్గం ! యీ రెడ్డిచ్చే

కూలితో పొట్టకూడ నిండదాయిరి! అన్ని జాగాల్లో దినానికి రూపాయి కూలి! మన మిల్లులో దినానికి బారానా! ఇంత కూడబెట్టి ఎవడి కిస్తాడో సూద్దాంగా! పద్దీకి వడ్డీలు, భూములకి భూములు దొంగలెక్కలు రాసి, దావాలుచేసి సంపాదించగలడు! పట్నం బోయినా మంచిగుండేది. దినానికి రూపాయి కళ్ళసూత్తాం!

**చిల:** ఒరే! తెలీకడుగుతా! మీనాయిన దఫేదారు పనిసేసిండుగా! సక్కగా సదువుకోనేకపోయి నావా?

**గుం:** ఈ వూళ్ళో బడి ఏడున్నది? ఆ పూజారాయన మొట్టికాయలు మొట్టబట్టి, మూడవ కిలాసు దాంకా సదుపగలిగినాను. సదువుకోవాలంటే పుట్టుకతో సరస్వతి రావాలె. ఆ భీమన్న కొడుకుసూడు, బలే దివిటీలాసదివేత్తుండాడు. ఉన్న భూములన్నీ సదువులకే తణఖా పెట్టి స్తుండా రైతయ్య! ఎంత సదువులు సదివినా యీ దినాల్లో నౌకరీల్లేవుగదా! మన గవరయ్యే అక్కకొడుకు లేడూ, ఆడు బిఏ, ఎంఏను సదివిండంట! నౌకరీ గివకరీ లేక సిగరెట్లు కాలుస్తూ ఊరుపొంటి తిరుగుతున్నాడంట!

చిల : సిగరెట్టంటే యాదకొచ్చింది. ఒక బీడీయియ్యే. యీ ముసలయ్య మాంచి బీడీల వ్యాపారం సేసి....

గుం : మామంచి బతుకు బతికిండుట ! కానీ కర్మ ! యీ ఎల్లారెడ్డి యీణ్ణి మోసంచేసి సొమ్ము గుంజేసినాడట ! ఆడి యిల్లు సూస్తివిగా తక్కువకాడికి రాయించుకుపోయిండు. కర్మ కాకుంటే ఆలుబిడ్డలు, భూములు అన్నీ పోడం ఏటిరా !

చిల : కనకయ్యదొర డాక్టరీ నదువుతుండాడటగా !

గుం : నదవడూ ! నాయనకు సాన పైసున్నది ! నదివి ఈ ఊళ్ళో పెద్ద ఆసుపత్రి పెట్టి, నీ దగ్గరా, నా దగ్గరా మిగిలిపోయిన డబ్బంతే రోగాలు పేరుతో, వాళ్ళకు పైసమీద ఆశ.

చిల : కూలి పెంచమని దరఖాస్తు పెట్టితిమిగందా ! ఏమయిందిరా !

గుం : సూస్తాడంట !

చిల : ఏ సూస్తాడో ! డబ్బుపెరిగి, బొజ్జ పెద్దదావు తుంటే వాడికి సూపు ఎక్కడ కనిపిస్తాదిరా !

చిల : కూలి పెంచడు ! బోనసులు యివ్వడు మరి !

పట్నంనుంచి ఆఫీసర్లు వత్తారు, మిల్లు సూస్తారు, పోతారు. ఏటవుతుందో మనగోల యినే దొరనే లేడాయిరి!

గుం: సమ్మెచేద్దాంరా మనమంతా కలిసి?

చిల: ఓయమ్మో సమ్మెనా! సమ్మెలు గిమ్మెలుసేస్తే కూలీ పోతదాయిరి! మరి కూడో...

గుం: ఇచ్చే కూలి సాలని మూలకూకుంటే, నీకు కూలేం పెరుగుద్దీ!... యిలా కూకునే మీరంతా మా యిండ్లు డుబాయిస్తున్నారు.

(కనకరెడ్డి, సూర్యం సూట్లతో ప్రవేశం. వెనకాల పెట్టెలు, బెడ్డింగులతో కూలీలు నడిచిపోతారు.)

చిల: ఒరోరే! అల్లా సూడెహే!

గుం: ఆ వచ్చేది రెడ్డిదొరేనా!

చిల: సూర్యంబాబు దణ్ణం!

కనక: ఏం గుండయ్యా! బాగున్నావా?

గుం: ఏదో యిట్టున్నా దొరా!

సూ: చిలకన్నా, ఏమంటోంది మనూరు?

చిల: మీకోసం ఎదురుచూత్తోంది దొరా.

గుం : ఎవరిగురించిరోయ్ సిలకన్నా కొట్టాడుతుం డావు !

చిల : ... పిల్లగురించి అనుకున్నావేటిరా ?

సూ : ఏ ఊరి పిల్ల ?

గుం : అద్దదే బోగంపిల్ల పుష్పం.

కనక : బాగుందా ?

చిల : ఓ, మా మాంచిగున్నది.

గుం : సదువులై పోయినాయా బారా ?

క : అయిపోయాయి !.... మిల్లు బాగా పని చేస్తుందా ?

గుం : (వ్యంగ్యంగా) మీ మిల్లుకేం బాంబాబు ! మే మున్నంత కాలం !!

క : (ఆశ్చర్యం)

సూ : రారా కనకం, మరోసారి మాట్లాడదాం.

క : మళ్ళీ కలుసుకుందాం గుండయ్యా. గుడ్ బై.

చిల : గుడ్డుమాణ్ణింగుచార్ !

గుం : చారు ఏటిరా, సారు. పులుసు !

చిల : ఇంగ్లీపీసు మాట్లాడుతుండానురా !

గుం : ఏడిసేవులే ! పద.

ముసలయ్య :

బతుకు మాయలు మరిచి బలుసాకుతిని ఒరుగు
శాంతిజీవులలోన సతమతము లెందుకో !
దూరతీరాలందు తిరిగేటి మనసుకూ
స్వంత దేహముపైన యింతింత చింతేల ?
ముసుగులో నీడలూ, మనసులో భావాలు
తెలియరావని తెలిసి తికమకలు ఏలనో
నిండు మనసులతోటి పండు భావిని తలచి
బతుకు లోతుల మరచు వయసునెందుకు

దూరి ॥బ॥

(భూమన్న బనీను, పంచ, తువ్వాలు, చేతిలో కఱ్ఱ చిరాగ్గా ప్రవేశం. వెనకాల వెంకటాద్రి)

వెం : ఏమయ్యోయ్ భూమన్నా,

భూ : ఎవరది ?

వెం : ఈ ఏడు పల్లపుభూమి పంట బాగాపండిందని మమ్మల్నందర్నీ మర్చిపోతున్నావేఁటి ?

భూ : అసలు ఎందుకు పిలిచేవు_నీకు పనిలేకపోతే ఎవరికీ పనిలేదనుకున్నావా ?

వెం : అంతమాటే (హిహిహి) నీ బాగుకోరి నిన్ను సిలుస్తే నాకు పనిలేదంటావా ? అంతేలే,

ఇంకొకళ్ళ బాగుగురించి ఆలోచించడమే తప్పు.

భూ : ఏమిటీ నా బాగుగురించి నువ్వు అంతగా బాధ పడేది ?

వెం : నీ కోసం సలహా చెప్పిపోదామని వచ్చాను.

భూ : ఆ చెప్పేది త్వరగా చెప్పు నాకు అవతల పనుంది.

వెం : చూడు మీ అమ్మాయి పెళ్ళి ఎప్పుడు ?

భూ : అది నీ కనవసరం.

వెం : పోనీ, పెళ్ళి చెయ్యదల్చుకో లేదా ?

భూ : నువ్వు చెప్పదల్చుకున్నది సూటిగా చెప్పు.

వెం : పెళ్ళి ఖర్చుకు భూమి తాకట్టుపెడితే... సాయం చేద్దామనుకున్నా.

భూ : నీ సాయం నాకేమీ అక్కర్లేదు.

వెం : సరే ఆ మాటమీదే నిలబడు... వస్తా.

భూ : నిలబడుతాను-నిలబడి తీరుతాను. నీ సలహా ప్రకారమేకదూ ఆ పుంత అవతల భూములు, యిల్లు తాకట్టుపెట్టించావు ఆ ఎల్లారెడ్డిదగ్గర। నీ సలహా ప్రకారమేగా ఆ రెడ్డి బాగా వడ్డీలు

పెంచి, అప్పు తీర్చకపోతే ఆస్తి వేలం వేస్తా
నని బెదిరిస్తున్నాడు ! నీ సలహా ప్రకారమేగా
ఈ ఊరంతా కట్టుకట్టి ఒకచీపురుపుల్ల సాయం
ఎవరూ చెయ్యకుండా మానేశారు. నీ సలహా
ప్రకారమేగా ఊరిపెద్ద గవరయ్య ఇష్టమొచ్చి
నట్లు అమాయకుల్ని ఏడిపిస్తున్నాడు రెడ్డితో
కలిసి ! నీ సాయానికీ నీకూ ఒక దండం
వెళ్ళు.

వెం : భూమన్నా నీకు అర్థం కావడం లేదు... నా
అసలుసంగతి నీకు తెలుసుగా - నే చెప్పాలా.

భూ : తెలుసు. పూర్తిగా తెలుసు. నీ దారిని నువ్వు
వెళ్ళు. నీ సలహాలు నాకేమీ అక్కర్లేదు.

(భూమన్న నిష్క్రమణ)

(గవరయ్య : మల్లుపంచ, మల్లులాల్చీ, బొద్దు
మీసాలు, పదునైన చూపులు)

గ : ఏమిటోయ్ ఘర్షణ జరుగుతోంది ?

వెం : తమరా... ఏముందండి. ఈ ఊళ్ళో భూమన్న
దెబ్బలాడని మనిషి ఎవడున్నాడు అని ఆలో
చిస్తున్నా. అంత చిరాకు, కోపం ఉన్న మనిషి
ఏం బాగుపడతాడండీ ! ప్రతివాడితోటీ కజ్జా
తెచ్చుకుంటే సంఘంలో బ్రతకడం ఎలాగ?

గవ : సంఘంలో జయప్రదంగా బ్రతకాలంటే ఎంతో నిలకడ, నెమ్మది, నిశితమైన బుద్ధి కావాలి. పరిస్థితులు బాగాపరిశీలించి పన్నుగడవేయాలి. ఈవేళ చిరాగ్గా వెళ్ళిపోతే మాత్రం రేపు పరాగ్గా నీదగ్గరకు రాడోయ్।... ఎటొచ్చీ నీ బుద్ధి ఉపయోగించాలి అంతే.

వెం : నాబుద్ధి- మీకు తెలుసుగా- చాలా నిశితం।

గవ : అయితే పన్నుగడ వేసుకో— కావాలంటే ఈ ఊరిపెద్ద గవరయ్యను మర్చిపోకు- తృణమో ఫణమో చాలు.

వెం : నా సంగతి మీకు తెలుసుగా.

గవ : (హేళనగా నవ్వి పోతాడు) తెలుసు.

ముసలయ్య :

సర్వంబు తెలుసనీ-తెగ విర్రవీగేటి
జీవు లే గతిపట్టి పోవునో మనసా ॥
అంతమే లేని ఈ ఆకాశ వలయాలు
అవని పరిధుల చుట్టు అతి నీల సముద్రమ్ము
పరిమితే లేని ఈ జగతినే చూచేవు
ఏమూల నలుసుగా ఏ స్థితిని నుంటివో
తెలుసుకుని తెలివితో మసలుకో మనసా ॥

## రెండవ రంగం

(భూమన్న యిల్లు. ఒకవారగా వాలివున్న నులకమంచం. ఒక త్రాటిపైన ఇంట్లో మాసిన బట్టలు, ఒక పార, గునపం, చేతికర్రలు. చెయ్యివిరిగిన ఒక కర్రకుర్చీమీద కూర్చుంటాడు.)

భూ : (బాధగా ఆలోచిస్తూ) అబ్బాయ్!

సూ : ఏం నాన్నా? (లోపలినుంచి ప్రవేశం)

భూ : చదువులు పూర్తిచేసి నువ్వు ఇంటికి వచ్చి ఆర్నెలలయింది. ముందు కర్తవ్యం ఆలోచించావా?

సూ : కర్తవ్యాలు ఆలోచిస్తూ కూర్చునేది కాదు నాన్నా! ఆచరణలో పెట్టాలి. ఆచరణలో పెట్టాలనుకునే కర్తవ్యం ఆలోచించాను.

భూ : ఏమిటి ఆలోచించావు?

సూ : స్వంత భూములు దున్నుకుంటూ సేద్యం చెయ్యాలని. భూములున్నవారిచేత సేద్యం చేయించాలని,

భూ : ఇంతకాలం సేద్యంచేసి నేనుబాగుపడిందేమిటి? వ్యవసాయంచేసే రైతంటే అందరికీ ఎంత లోకువో తెలుసా! పంట పండటం నీచేతుల్లో లేదు! ప్రకృతి దయదలచాలి! ప్రజలు దయ చూపాలి. అందులో దరిద్రం ఆవహించిన రైతును అందరూ నాశనం చేస్తారు. సమయానికి సహాయం రాదు. సహాయం దొరికినా, చావో, సహాయమో ఏరుకునే పరిస్థితి ఏర్పడుతుంది. రైతు జీవితంలోని కష్టనిష్ఠురాలు నీకు తెలియవు బాబూ! ఏభయ్యేళ్ళపడిలో ఒళ్లువంచి కాయకష్టం చేసుకుంటున్నా ఇప్పటికీ మన ఆర్థిక పరిస్థితి ఏమీ బాగుపడలేదు. అందులో బాగుపడేవాడిని పాడుచేసేసంఘంలో మంచిగా బ్రతకడం చాలా కష్టం.

సూ : కష్టమనుకుంటే ఏ కార్యం చెయ్యలేం. ఏ జీవితంలో ఏర్పడే పరిస్థితులైనా చాలావరకు స్వయంకృతాలే! ఎవరి పరిస్థితులు వారు చక్కదిద్దుకోడానికి ప్రతీ మానవుడికి ఎంతో అవకాశం ఉంటుంది. అది వినియోగించుకోవాలి అంతే.

భూ : నీకు యుక్తవయసు వచ్చింది. నా పరిస్థితులు విపులంగా చెప్పవలసిన అవసరం కలిగింది

కనుక, చెప్తున్నా. నువ్వా బి. ఏ. పాస
య్యావు! నీ చదువులకు ఎంత ఖర్చయిందో
తెలుసా! మీ తాత యిచ్చిన అయిదెకరాల
పొలంతో ఈ అయిదుగురు పిల్లల సంసారం
నెట్టుకొస్తున్నానంటే, ఎలా గడుస్తోందో
నువ్వు ఆలోచించావా! కష్టపడి నీ చదువు
పూర్తిచేస్తే ఏదో ఉద్యోగం సంపాదించుకొని
యింటికి యింత ఆధారం అవుతావనుకున్నాను!
నాలాగే సేద్యం చెయ్యాలనివుంటే, నీకు
భూములేవీ. మన సొంత అసెతిలి నాల్గెకరాలు
తణఖా పెట్టాను! ఇల్లుకూడా తాకట్టు పెట్ట
వలసి వచ్చింది! ఊళ్ళో ప్రజలతో వైరం
తెచ్చుకున్నాను! పెరిగిన వడ్డీతో సహా తన
అప్పు తీర్చకపోతే ఆ ఎల్లారెడ్డి ఈ యిల్లు,
భూములు వేలంవేసి తన స్వాధీనం చేసుకో
వాలని కుట్రపన్నుతున్నాడు. ఆ నాగులచెరువు
వెనక ఉన్న ఒక ఎకరం పల్లపు భూమేగా
నువ్వు సేద్యం చేసేది!

సూ: భూములు తాకట్టు ఎందుకు పెట్టారు! డబ్బు
లేక భూములు తాకట్టుపెట్టారని తెలుస్తే,
చదువే మానేసేవాడిని. జీవితంలో ఒక వృత్తి
ఏర్పరచలేని ఈ చదువులు చదివేకంటే
మానుకుంటేనే ఉత్తమం.

భూ : అవును. చదువులు పూర్తి అయ్యాక ఎన్ని కబుర్లయినా చెబుతాను. అంత ఖర్చు నీ చదువులకు కాలేదు. ఒకరోజు నుంచి అప్పటి పొలం దున్నుతున్నాను. నా ప్రక్క భూమిని మోతుబరి రైతు వెంకయ్యగారో కట్టాలని చూస్తున్నారు. తన భూమిలో కొంత భాగం నా దానిలో కలుపుకున్నానట! దానికి తోడు పెద్ద గవరయ్య హైకోర్టాయె! నామీదకు వ్యాజ్యం తెచ్చాడు. చేతిలో డబ్బులేక అప్పుచేసేను ఖర్చుకు. దావాలు నా జీవాన్నే పెనవేశాయి. ముప్పుతిప్పలా పెట్టాయి. చివరకి గెలిచాను. కాని పట్టుదలకోసం ఎక్కువకు ఎంత డబ్బు ఖర్చు చెయ్యవలసి వచ్చిందో ఏం చెప్పను? ఇవంతా ఆ ఎల్లారెడ్డి చేసిన పన్నాగం. పంచాయతీ ఎన్నికలలో సహాయం చేయక పోయానన్నా నని కసి! శాంతిగా బతకడం కూడా ఆత్మీయుల మధ్య కష్టమే. చివరకు ఆ తనఖా భూములు, శిథిలమైన ఈ ఇల్లు, చితికిపోయిన నేను మిగిలాము. నన్ను యీ చితికిన సంసారం లోంచి బయటికి లాగాలంటే నువ్వు ఉద్యోగం చెయ్యాలి సూర్యం!

సూ : హుం! ఉద్యోగం! ఉద్యోగం సంపాదించడం

మాత్రం సులువా నాన్నా! నాలాగే ప్రతి ఏడు కాలేజీలలోంచి బయటికి ఎంతోమంది పట్టా పుచ్చుకొని వస్తున్నారు. వాళ్ళు ఉద్యోగం కోసం ఎంత కష్టపడుతున్నారో నాకు తెలుసు! అందరికీ ఉద్యోగాలు దొరకాలంటే మాత్రం అసాధ్యమైన విషయం. దరిద్రంతో తప్పని సరి అయితే మాత్రం ఉద్యోగం కోసకో వచ్చు. మరో మంచి విధానంగా బ్రతకడానికి ఏ మాత్రం వీలున్నా ఉద్యోగం మానడం శ్రేయం. ఒక వృత్తి యివ్వలేని చదువు విజ్ఞానదాయకమే అవుతుంది. దాన్ని అంత వరకే వినియోగించుకోవాలి. ఉద్యోగం చేస్తే మాత్రం లాభం ఏమిటి నాన్నా! ఇతరులకు సలాములు చేస్తూ గులాములుగా బ్రతకడమేగా! మనిషిలో స్వతంత్ర బుద్ధికి సావకాశమేదీ! శాంతియుతమైన స్వతంత్ర జీవితంలో ఎన్నో శక్తులు పెంపొందించుకోవచ్చు ప్రతి నిమిషం ఇతరుల చాకిరీకి గడిపే జీవితంలో అభివృద్ధి ఏముంటుంది?

భూ: నువ్వు నాదగ్గర సిద్ధాంతాలు పల్లించకు. పరిస్థితులు అర్థం చేసుకోవేం? వ్యవసాయం ఎల్లా చేస్తావురా? ఈ ఏడు పల్లపు భూమిపై

వచ్చిన పంటతో అప్పులే తీరుస్తానా, ఎదిగే పిల్ల పెళ్ళి చేస్తానా? తక్కిన పిల్లల చదువు సంధ్యలకే ఖర్చుపెడతానా? మనపై ఆధారపడిన ఎద్లుకూడా మనలిని విడిచి వెళ్ళిపో యాయి. ఒంటిగా నాగలి మోసేలా వుంది. ఇంతకాలం ఓపిగ్గా నీకు చదువు చెప్పించిం దెందుకు? మావాడు చదువుకుని ఏ తహా సిల్దారో, కలెక్టరో అవుతాడని మీ అమ్మ ఎన్ని కలలు కంటోంది! నీమీద ఎన్ని ఆశలు పెట్టుకుంది! నీకోసం డబ్బంతా ఖర్చు పెట్టి ఎంత దరిద్రమైనా భరించేమే! ఇప్పుడు ఉద్యోగం చెయ్యవూ? ఆ మాట ఎలా అన గలిగినావురా?

సూ : మనిషి జీవితంలో ఒక నమ్మకం, లక్ష్యం ఉండాలి. సేద్యం చేసుకుంటే శాంతిగా బ్రతక వచ్చని నాకు నమ్మకం వుంది. నా భూములు నేను పండించుకుని శాంతిగా బ్రతకడమే నా లక్ష్యం. నేను ఉద్యోగం చెయ్యలేను నాన్నా.

భూ : ఉద్యోగం చెయ్యకపోతే యింట్లో ఎంతకాలం మేపుతాననుకుంటున్నావు?

సూ : నా భారం మీమీద లేకుండానే బ్రతుకుతా నాన్నా.

భూ : సిద్ధాంతాలు, నమ్మకాలు అని తీవ్రంగా ఉప న్యాసా లివ్వడం తప్ప, బ్రతుకులు ఎలా బాగు చేసుకోవాలో తెలియదు.

సూ : నా బ్రతుకు నేను బాగుచేసుకుంటా! పది మందినీ బాగుచేస్తా. ఆ మోడులాంటి నాగలి, ఆ తణఖా భూములు నాకు అప్పచెప్పండి.

భూ : ఎంత చెప్పినా తెలియదేం నీకు! ఇంట్లో డబ్బులేక ఎంత బాధగావుందో తెలుసా? మీ అమ్మ రెండు చీరలతో కాలం గడుపుతోంది. పెండ్లికి ఎదిగిన నీ చెల్లెలికి సరైన బట్టలు లేవు. వేల కట్నాలు యిచ్చుకోందే సంబం ధాలు కుదరవు. పోతున్న కొంపకు బాగులు లేవు. ఈ శిథిలమైన పల్లపుభూమిమీద వచ్చే పంట తిండికే చాలదు. ఆ ఎల్లారెడ్డి మాట మీద నడిచే ఊళ్ళో జనం కూడా సాయం చెయ్యరు! ఎల్లాగరా బ్రతకడం ఈ పరిస్థి తుల్లో! నువ్వు ఉద్యోగం చెయ్యనంటేఎలాగ?

సూ : ఈ పరిస్థితులన్నీ మనం చేతులారా తెచ్చి పెట్టుకున్నవి. అసలు ఉద్యోగం దొరకడమే కష్టమైన ఈ రోజుల్లో, దానికోసం కాలం వృథాపుచ్చేకంటే నాగలిపట్టి పొలంలోకి దుము

కడమే. ఈ లోగా ఫలితం కనిపిస్తుంది. ఉద్యోగాలంటూ అందరూ గ్రామాలు విడిచి పోతే, పల్లెల్లో మన భూములు పండించే దెవరు? దేశానికి ముఖ్యమైన సేద్యాన్ని మరిచి, విదేశీకర్తలకి గులాముగిరీలు మాత్రం చెయ్యలేను. నాజూకు నాగరికతల పట్నంలో ఎంతడబ్బు తెచ్చుకుంటే ఏం చాలు తుంది? ఎవరి వృత్తులు వారు చక్కదిద్దు కుంటే దరిద్రం ఉండే అవకాశ మేది? వృత్తి ఇవ్వలేని విద్యలు మాని, ఉన్న వృత్తులు పెంపొందించుకోవడం మంచిది. విజ్ఞాన సంపాదనకు అనేక మార్గా లున్నాయి. కాలేజీలకే వెళ్ళనక్కరలేదు నా వృత్తి వ్యవ సాయం. నా ఆధారం భూమి. ఇవి విడిచి నేను ఉద్యోగానికి వెళ్ళలేను నాన్నా.

భూ: ఉద్యోగం చెయ్యకపోతే వెళ్ళు, ఇంట్లోంచి వెళ్ళు. నిన్ను పోషించేవాళ్ళవరూ లేరిక్కడ. వెళ్ళు.

సూ: అది నీ కిష్టమైతే అలాగే వెళ్ళిపోతా నాన్నా.

(నిష్క్రమణ)

భూ: వేడిరక్తం! అన్నీ సిద్ధాంతాలే! అన్నీ ఆశ

యాలే. చల్లారిన నాలాంటి వృద్ధునకు ఏమర్థ మవుతాయి! మమతల మాధుర్యాన్ని వదల లేని నాలాంటివారికి మరణందాకా బాధ్యతల బరువుతో బ్రతకడమే శరణ్యం.

(గవరయ్య ప్రవేశం)

గవ : ఏమోయ్ భూషన్నా! ఊళ్ళోవుండికూడా కని పించడం మానేశావు.

భూ : గవరయ్యగారా! రండి... ఏవో పనులు చూసుకోవడంతోటే సరిపోతోంది.

గవ : నువ్వు కనిపించటం లేదని ఆ కనకరెడ్డి పది సార్లు పిలిపించాడు నన్ను. అవసరానికి కావా లంటే ఆదుకుని అప్పుయిస్తే యింకా ఎంత కాలం పడుతుందయ్యా తీర్చడానికి. ఏదో నా మాటవిలువమీదుగా అప్పుయిస్తే నా గౌరవం నిలబెట్టేవుగావు!

భూ : మీరుకూడా అలా అంటే ఎలాచెప్పలండి! మీకు తెలుసుకదా ఆ వెంకయ్య వ్యాజ్యాల్లో తిరిగి ఎంతో హైరానపడి అయిదువేలు ఖర్చు పెట్టానో! నా రోజులు బాగులేకపోదట్టి ఇన్ని అవస్థలు! త్వరలోనే తీర్చుకుంటా!

గవ : ఏదో నువ్వు అప్పు తీర్చలేని పక్షంలో ఆ

భూములు, యీ యిల్లు స్వాధీనం చేసుకో వలసివస్తుందని అంటున్నాడు రెడ్డి. అది అమ్మినా అప్పు తీరేలా లేదుకదా!

భూ: మీరుకూడా ఇలా అంటారేమిటి గవరయ్య గారూ! తనఖాపెట్టిన నాల్గెకరాల భూమి అమ్మితే అధమం ఆరు వేలేన వస్తాయి. ధరలు తెలియనివాడికి చెబుతోనట్టే అంటు న్నారు.

గవ: నేను వాకబు చేసేగా! ఒకవేళ వేలం వేసినా ఒక్కడూ ఏడెనిమిది వందలు మించి పాడేలా లేడు ఈ ఊళ్ళో! పరే పరాయివూళ్ళోవాళ్ళు మనభూములు కొనుక్కొని నెగ్గదెళ్ళడం కష్టంకదా! తరతరాలునుంచీ వస్తున్న కట్టు బాటేకదా. మన భూములు ఎల్లాగయినా మనలో మనం సర్దుకోవాలనే విశ్వాసం!... అయినా నువ్వో ఆలోచించు!

భూ: అయితే ఆ ప్రయత్నాలు కూడా జరుగుతున్నా యన్నమాట! ఏమండీ గవరయ్యగారూ! నన్ను అనవసరంగా హింసిస్తే మీకేమి వచ్చింది? నాదారిని నన్ను సుఖంగా బ్రతక నీయలేరా?

గవ : బాగుంది! నేనేం చేసేనోయ్ నిన్ను! ఏదో ఊరి పెద్దనిగదా అని, నీ శ్రేయస్సు కోరి నీకు సహాయిద్దామని వస్తే, నిన్ను పాడు చేస్తున్నానంటున్నావేనిటి?.... అయితే ఆ సంగతులు నువ్వూ, ఆ ఎల్లారెడ్డి తేల్చుకోండి! నేనెందుకు మీమధ్యగా......వస్తా (లేచి నుంచుంటాడు)

భూ : గవరయ్యగారూ....అలా ఆగ్రహిస్తే ఎలా చెప్పండి!... అప్పులపాలైనవాడి బ్రతుకు లోని అధోగతి యిప్పటికి అర్థమైంది... బ్రతుక్కి ఆధారం మరోటి లేనప్పుడు అప్పు తప్పదు.... కాని యిచ్చేవాడే దొరకడం కష్టం.

గవ : కొంపతీసి, యింకా అప్పు కావాలంటావా యిప్పుడు ?

భూ : మీరు దయచూపకపోతే ఎలాగ.... మీరు చెబితే ఆ ఎల్లారెడ్డిగారు వింటారు ఇంట్లో కూతురు భూదేవి పెండ్లికి ఎదిగి ఉంది. పోరుగూరి పీరన్నగారి అబ్బాయి పెండ్లికి ఒప్పుకున్నాడు. ఇప్పుడు రెండువేలుకావాలి.. ఆ పల్లపు భూమి తాకట్టుపెడతా..: ఆ రెండు

వేలు రెడ్డిగారి దగ్గరనుంచి యిప్పించాలి. మీరు తల్చుకుంటే చెయ్యగలరు.

గవ : ఇది మరీ బాగుంది. నేను మాత్రం చెప్పలేను. ఇప్పటికే ఆ రెడ్డి నన్ను నానా మాటలూ అంటున్నాడు.... తీరా అప్పు యిప్పిస్తే నువ్వు తీర్చలేవు.... ఒకవేళ గ్రామములు వేలం వేస్తామంటే నువ్వు బాధపడతావు... మీ బాగుకోరి సాయంచేసినా చివరికి మామీదే తిరిగిపడుతుంది మున్ముందు. పాడుచేసేమనే అపవాదు. నాకెందుకు ఈ గొడవ... (పోబో తాడు).

భూ : గవరయ్యగారూ.... నా మనవి కొంచెం వినండీ! పరిస్థితులు బాగులేక మిమ్మల్ని ప్రాధేయపడుతున్నా!

గవ : ఏమో నాకు చేతకాదు.

(వెంకటాద్రి ప్రవేశం)

వెం : తమరుకూడా యిక్కడే వున్నారే! గవరయ్యగారూ! సమయానికి నేనూ వచ్చేను... మీకు తెలుసుగా నా సంగతి! ఏమయ్యా భూమన్నా ఏమిటి ఏమిటి? ఏదో చెప్పుకుంటున్నావు! ఏదో తోచిన సహాయం నేనూ చేస్తా! నీకు తెలుసుగా నా సంగతి!

గవ : ఇవేమిటోయ్ ! వెంకటాద్రి ! ఇప్పుడు చేసిన అప్పు చాలక, రెడ్డిగారివగ్గర యింకో రెండు వేలు అప్పు యిప్పించమంటాడు... ఆ రెడ్డి గారు లక్షాధికారి అయినంతమాత్రాన అంద రికీ అప్పులిస్తూ కూర్చుంటే ఆయన వ్యాపా రాలు ఏంచేసుకోగలడు !

వెం : ఓస్ ! అంతేనాండి ! అప్పు కావాలంటే ఆ చెరువుపక్క పల్లపు భూమి తాకట్టుపెట్టవోయ్ భూమన్నా ! నేను చెప్పాగా మొన్న నీతోటి! మీలాంటివాళ్ళ బాగేకదూ నాకు కావలసింది ! నాలాంటి ఒంటరిగాడు యింకెవరి బాగు కోరు తాడు ?... నీకు తెలుసుగా నా సంగతి !

గవ : ఆ పల్లపు భూమిమీద రెండువేలు ఎవరు యిస్తారోయ్ !

వెం : అవును, నేను ఊళ్ళో వాకబు చేసేగా ! ఎవ రైనా యిస్తే అధమం వెయ్యి యిస్తారు ! అయినా ఆమాత్రం అప్పుయిచ్చే మొనగాదేడీ యీ వూళ్ళో ! శుభం వచ్చినా, అశుభంవచ్చినా ఆ రెడ్డి మహారాజు వున్నాడు కనుకనే యింత మందిమి బ్రతికిపోతున్నాం ! ఆ వెయ్యికి ఒప్పుకుని ఆ భూమి తాకట్టుపెట్టు. నీ బాగు

కోరి చెబుతున్నా! నా సంగతి నీకు తెలుసుగా?

భూ: వెయ్యి రూపాయలు ఏంచాయి మందమే! ఇంక పదిహేను వందలైనా ఇస్తుతే దక్కుతుంది ఏ ఇంట్లో తాకట్టుపెట్టి మరో చోట తెప్పించుకుంటాను.

గవ: అయినా డబ్బిచ్చేవాళ్ళం మనం ఏమనినా... రెడ్డిగారిని అడగాలి.

వెం: ఇదిగో భూం ఎన్నా పదిహేను వందలనకు... కావాలంటే ఆఖరిమాట పన్నెండు వందలు!

గవ: మనం ఎవరమోయ్ ఆఖరిమాట చెప్పడానికి.

వెం: గవరయ్య మాట తోసేస్తారా రెడ్డిగారూ! నాకు తెలుసుగా... ఊఁ అనవోయ్ ఏమంటున్నా!

భూం: ఉద్యోగం చెయ్యని కొడుకు ..అప్పులపాలైన బ్రతుకు....ఇంతకన్న అధోగతి ఏముంది? ఇంక బాగుపడడం కల్ల. కానీ పండి. మీ యిష్టప్రకారం. ఆపిల్ల పెండ్లిభారం తీరినా ఒక బాధ్యత తీరినట్టే!

వెం: మీకు తెలుసుగా నాసంగతి! మనమాటంటే భూమన్నకు వేదవాక్కు. మీ అబ్బాయి కులాసాగా వున్నాడా! మీ భార్యాపిల్లలు కులాసాయేనా? ఇది కనుక్కుందామని ఇక్కడికి

వచ్చాను ! నా కెసరున్నారు క్షేమం అడగ టానికి! నేను ఒంటరివాణ్ణిగా! నీకు తెలుసుగా నా సంగతి !... పదండి గవరయ్యగారూ !

గవ : సరే రెడ్డిగారితో చెబుతాను. రేపువచ్చి నోటు వ్రాయించుకో !... మనుసుపటి అప్పులమాట ?

వెం : ఏమండీ గవరయ్యగారు : మీరు ఊరి పెద్ద కదా ఆ మాత్రం సాయం చెయ్యలేరు ! కష్టా లలో ఉన్నవాడిని రక్షించడమే ఊరిపెద్ద కర్తవ్యం.... రెడ్డిగారితో చెప్పండి యితని గురించి... తర్వాత మెల్లిగా అన్ని అప్పులు ఒక్కసారే తీర్చుకుంటాడు.— ఏ మోయ్ ఘ్రామన్నా అంతేనా ! నీకు తెల్సుగా నా సంగతి !

గవ : మంచిది వస్తామయ్యా ఘ్రామన్నా.

వెం : సెలవు ఘ్రామన్నా !.... మళ్ళీ కలుస్తాగా ! నీకు తెలుసుగా నా సంగతి !

## మూడవ రంగం

(ఆసుపత్రి. కనకరెడ్డి డాక్టరు దుస్తుల్లో ఉంటాడు. టేబిలు, కుర్చీలు వైద్యశాలలో ఏర్పాటుచేయబడి వుంటాయి. కాంపౌండరు నరసింహం సీసాలు అవీ సర్దుతుంటాడు.)

క: నరసింహం! బైట యింకా రోగులున్నారేమో చూడు!

న: చిత్తంసార్! (చూసి) ఎవరూ లేరుసార్. అంతా ఖాళీగావుంది.

క: టైమెంతయింది?

న: ఏడు కొట్టింది సార్.

క: నీ పని అయిపోయిందనుకుంటా!

న: మీకు అయిపోయిందంటే అయిపోతుంది సార్ (హిహిహి)

క: అయిపోయింది వెళ్ళు.

న: మీబాబుగారి దగ్గరకంటె మీదగ్గరే పనిచెయ్యడం బాగుందండి. ఏడుకొట్టగానే యింటికి పొమ్మంటారు (హిహిహి).

క : వెళ్ళవోయ్! అట్టే జాప్యంచెయ్యకు. రూల్సు ప్రకారం ఆసుపత్రి ఏడుగంటలదాకానే పని చేస్తుంది. ఏడు గంటలుదాటితే ఆసుపత్రిలో నేనుతప్ప, ఏ యితర ఉద్యోగీ పనిచెయ్య కూడదు. నా ఉద్దేశ్యంలో రూల్సు అమలు జరపాలి. నీచేత ఎక్కువపని చేయించుకుంటే నాకు వచ్చిన లాభమేమిటి?... వెళ్ళు.

న : చిత్తం సార్. పొడిదగ్గుపట్టింది ఒక డోస్ తీసుకుపోతా సార్.

క : మంచిది, త్వరగా వెళ్ళు!

(కనకరెడ్డి చిరాగ్గా అటూ ఇటూ తిరుగుతూ చేతి వాచీతీసి చూసుకుంటుంటాడు నర సింహం వెళ్ళిపోబోతుంటాడు పుష్ప వస్తుంది. కనకరెడ్డి కొంచెం కంగారుగా ముఖం పెడ తాడు. పుష్ప, నరసింహాన్ని చూసి కొంచెం తెల్లబోతూ సర్దుకుంటుంది.)

న : ఏమమ్మా! యిలా వచ్చినావు? ఒంట్లో బాగు లేదా?

పు : ఆ! ఒంట్లో బాగులేదు.

న : ఏమొచ్చింది?

పు : ఆ....(కొంచెం తొట్రుపడి) దగ్గు, ఒల నొప్పి

న : జ్వరం కూడా వుందా ?

పు : ఉ....కొద్దిగా వున్నట్టుంది....ఒళ్ళు కొంచెం వేడిగా వుంది.

(కనకరెడ్డి, నరసింహంపైపు చు ు చు రా చూస్తుంటాడు.)

న : డాక్టరుగారిచేత చెయ్యి చూపించుకో. మందు నే యిస్తాను. సీసా ఏదీ ?

పు : సీసా మర్చిపోయేను.... ఆసుపత్రిలో ఏదేనా యివ్వండి.

న : ఏమండి సార్ ! మన ఆసుపత్రిలో ఖాళీ సీసాలు ఏమీ లేవే!

క : ఏడుగంట లయిందిగా ! నువ్వు వెళ్ళు ! ఎవ రైనా రోగులువస్తే నేను మందిచ్చుకుంటాగా!

న : మీకెందుకు సార్ శ్రమ ! ఈ అబ్బాయికి మందుకలిపి వెళ్ళిపోతా ! ప్రస్తుతం ఉన్నాగా.

క : నీకెందుకోయ్ ఆ శ్రమ ! నీచేత ఎక్కువగా పనిచేయించుకోవడం నా కిష్టం లేదు.

న : అదేమిటి సార్ ! మీదగ్గర పనిచేయడంఅంటే నాకు సరదా సార్ ! ఈవిడకు మందిచ్చి వెళ్ళి పోతాలెండి !

క : నువ్వు వెళ్ళవయ్యా బాబూ ! యింటిదగ్గర నీ భార్యాపిల్లల గొడవ యింక నీకు అక్కర్లేదా !

న : యస్ సార్ ! మా వాణి త్వరగా యింటికి రమ్మంది ఈవేళ. థేంక్యూ సార్ ! జ్ఞాపకం చేసినందుకు థేంక్యూసార్ !

క : మంచిది వెళ్ళవయ్యా బాబూ !

(నరసింహం నిష్క్రమణ. రెడ్డి, పుష్ప ఒకరిని చూసి ఒకరు నవ్వుకుంటారు అతను వెళ్ళగానే !)

క : కూర్చో పుష్పా !

పు : మీ ఆసుపత్రి బాగా నడుస్తోందా !

క : చూస్తున్నావుగా !

పు : మీరీ ఆసుపత్రి పెట్టేక కలుసుకోవడమే కష్టమైపోతోంది.

క : అల్లా అనడం ఎందుకు ? నువ్వు ఆ పిల్లలబడి పెట్టాక యిటు రావడమే కష్టమైపోతోంది అని చెప్పకూడదూ !

పు : నేను పంపిన కబురు అందిందా ?

క : అందింది. మీకోసమే ఎదురుచూస్తూ కూర్చున్నాను.

పు : మీతో ఒక ముఖ్యమైన పనివుండి వచ్చాను

క : అంటే, పనిమీద వచ్చారన్నమాట ! నా కోసం కాదన్నమాట !

పు : ఊహూ (నవ్వుతుంది)

క : అయితే మీపని చెప్పండి .. ఒంట్లో బాగు లేదా !

పు : హాయిగా ఉన్నా. ఏ రోగమూ లేదు. అందుకోసం కాదు.

క : మరి?

పు : మీరు లక్షాధికారి బిడ్డలుగదా...చిన్న సహాయం చేస్తారని వచ్చాను.

క : నాకు చేతనైతే సహాయం చేస్తాను.

పు : నా స్కూలుకు మీరొక అయిదు వందలు చందా యివ్వాలని కోరుతున్నా.

క : ఎందుకు ?

పు : నా బడిలో అనాథ బాలికలకు, పలకలు, పుస్త

కాలు కొనడానికి ఒక నిధి ఏర్పాటుచెయ్యా
లనుకుంటున్నా... మొన్న మన ఊరిచివర
మా పల్లికి వెళ్ళాను. ఎంతోమంది పిల్లలు
పోషణలేక, సంస్కారం లేక వీధుల్లో
దుమ్ములో మాగటిలోపడి ఆడుకుంటున్నారు.
మెరుగుపెడితేనే బంగారం మెరుస్తుంది చదు
వంటూ చెప్పిస్తే ఆ పిల్లల్లో ఎంత తెలివైన
వాళ్ళు కనిపిస్తారో! వాళ్ళ చదువులు పూర్తి
య్యేదాకా సహాయం చెయ్యాలంటే ఏదైనా
నిధి వుండాలి కొంతమంది పిల్లలకు సరిగా
తిండీ, బట్టలూ లేదు. ఇంక పలకలు, పుస్త
కాలు ఏం కొనగలరు?.... అసలు ఈ
వూళ్ళో పిల్లలని నా దగ్గరకు కొంతమందిని
పంపడానికే జంకుతున్నారు. భోగంపిల్ల బడి
పెట్టడమేమిటని....నా అదృష్టం కొద్దీ మీ
స్నేహం లభించింది కనుక నాకు యింత
చదువుసంధ్యలు అబ్బాయి! మీరు చదువులకు
పట్నానికి వెళ్ళిపోయారు. నాకు కాలక్షేపంగా
వుంటుందని మొదట పిల్లల్ని పోగుచేసి
పాఠాలుచెప్పా! ఇకముందు యీ బడినే
ఆధారం చేసుకుని నా జీవితం ఒంటరిగా
గడపాలేమో అనుకుంటున్నా. మా అమ్మ

వదిలిన నా ఆస్తి యావత్తూ అమ్మితే ఖర్చు పెడతా! కాని ఇది జాగుపడాలంటే మీలాంటి వారి ధనసహాయం కూడా కావాలి అందుకే వచ్చాను మీదగ్గరకు!

క : ఓస్ యింతేనా, తప్పకుండా యిస్తా. (డ్రాయరు లోంచి డబ్బు తీసి యిస్తాడు).

పు : మీ సహాయం మర్చిపోలేనండి.

క : మంచిది.... పనయిపోయిందిగా, యింక మీరు వెళ్ళిపోతారనుకుంటా.

పు : నాకేపన్నా కొత్త పుస్తకాలు ఇవ్వండి.... మునుపు మీరిచ్చినవన్నీ చదివేశాను. అవన్నీ కలిపి లైబ్రరీగా తయారుచేసి స్కూల్లో పెట్టాను.

క : మీరు చందా అడిగారు. చందా ఇచ్చేశాను తక్కిన విషయాలతో నాకుసంబంధం లేదు... మీరు వెళ్ళండి!

పు : మీ ఒంట్లో ఆరోగ్యంగా వుందాండీ!

క : మీరు వెళ్ళండి!

పు : మొన్న మీరు చెరువుగట్టుకు వచ్చినప్పుడు మాట్లాడుదామనుకున్నా, ఇంకా ఎవరితోనో

స్నేహితులతో ఉన్నాడని పూరుకున్నా.

క : చందాకోసం వచ్చినవారు ఇవన్నీ మాట్లాడకూడదు.

పు : లేదు. మీకోసమే వచ్చాను. (నవ్వుతూ)

క : నిజంగా ?

పు : ఆ.

క : అయితే చెప్పు... చెరువుగట్టుమీద మరి పిలవకపోయినావా !

పు : బాగుండదని ఊరుకున్నా... భోగం పిల్లతో మాట్లాడితే మీ పరువు. ప్రతిష్ఠలు పోవూ ?

క : పోతాయి ! పోయాయి కూడా. పూర్తిగా పోవాలని ప్రయత్నం చేస్తున్నా... ఒక ఆలోచన తట్టింది.

పు : ఏమిటది !

క : అదే !

పు : ఏదీ ?

క : పుష్పా ! ఎంతకాలం... ఈ దాపరికం. ఏమైనాసరే మా నాన్నతో చెప్పి నిన్ను పెండ్లి చేసుకుంటున్నా.

పు: మీ నాన్నగారికి తెలిస్తే మంచిపడిపోతారు! ఇప్పటికే ఊరంతా నన్నుగురించి నానా విధాలుగా అనుకుంటున్నారు. గవరయ్య, ఆ వెంకటాద్రి... వాళ్ళకి అక్కర్లేని గొడవ లేదు. ఊరంతా ఇష్టమొచ్చినట్టు కూస్తున్నారు. మొన్న మా ఇంటికి వచ్చాడు గవరయ్య. ఏదో నానా మాటలు వాగేడు... ఇంట్లోంచి గెంటెయ్యవలసినంత పని జరిగింది. ఈ పద్ధతిలో ఇక్కడవుంటే నా బ్రతుకే ప్రమాదంలో పడేలావుంది... నూవాళ్ళు చేసిన వంశవృత్తి పాపాలన్నీ నే భరించలేను. బ్రతుకు తే హాయిగా గృహిణిలా బ్రతకాలి. లేక పోతే చావాలి. పడుపువృత్తితో నే కడుపునింపుకోలేను... బ్రతుకు నడుపుకోలేను యింక (దుఃఖంతో)

క: పుష్పా! అందుకే నేనూ ఒక నిశ్చయానికి వచ్చాను. చిన్నప్పటినుంచి నీకూ నాకూ స్నేహం కలిగింది. ఎలా కలిగిందో, ఎప్పుడు కలిగిందో చెప్పలేకపోయినా, నీ స్నేహం కలిగేక నాకు నిజంగా ఎంతో ఆనందం కలిగింది నాకు నువ్వు కావాలి పుష్పా! ఎలాగైనాసరే నువ్వు కావాలి. ఎవరి జీవితాలు

వారు సరిదిద్దుకోడానికి దైవం ప్రతివాడికి అవ
కాశమిస్తాడు. అది వినియోగించుకోవాలంటే
తల్లిదండ్రుల పాపాల ఫలితాలు సంతానంపై
ఆరోపించి నాశనంచేసే సంఘాన్ని ఎదుర్కో
వలసిన రోజువచ్చింది. నీ జీవితం నిష్కళంకంగా
వున్నంతకాలం నిర్విచారంగా, ధైర్యంగా
బ్రతకవచ్చు మతాలు, కులాలు, వృత్తులు
మానవనిర్మితాలు. మనసులు కలిసినప్పుడు,
ఇవేమీ అడ్డురావు నేను నిన్ను పెళ్ళిచేసు
కుంటా పుష్పా! నువ్వు అధైర్యపడకు

పు: అసలు ఆ విషయం అడగాలనే వచ్చాను.

క: నాకుతెలుసు పుష్పా! మనపెళ్ళి త్వరలోనే జరిగితీరుతుంది.

పు: ఏమైనా క్రొత్త పుస్తకాలివ్వండి!

క: ఇది ఆసుపత్రి: ఇక్కడ నీకు కావలసిన పుస్తకా లేముంటాయి? నేను స్కూలుకి పంపిస్తాలే!

పు: మరి... వస్తానండి.

క: మరి... మందు తీసుకువెళ్ళవూ?

పు: మందు యిచ్చేపేరుగా!

క: ఇచ్చేశానేమిటి?

షు : మరిచిపోయి వుంటారు... వస్తానండి. (నిష్క్రమణ).

(పేబిలుమ్మీన కాగితాలు సర్దుతూ, యీలవేసు కుంటూ కోటు తొడుక్కుంటాడు అసువృతి విడిచిపోవామని.)

(సూర్యం ప్రవేశం)

సూ : కనకం!

క : ఓ! సూర్యమా! ఏమిటిలా రాత్రి వచ్చావు?

సూ : పొలంనుంచి వస్తున్నా! నిన్ను ఒకసారి చూడాలని ఇలా వచ్చాను.

క : కులాసాగా వుంటున్నావా?

సూ : ఆరోగ్యానికి లోటు లేదు. నీదగ్గరికి వచ్చే వాళ్ళంతా రోగు లనుకోకు మరి!

క : ఏంచేస్తాం! డాక్టరు సృష్టి అలాగే పోతూ ఉంటుందిలే!

సూ : నీతో మాట్లాడాలి కనకం!

క : ఊం కానీ!

సూ : చిన్నప్పటినుంచి నీకూ నాకూ వున్న స్నేహం పురస్కరించుకుని మాట్లాడుతున్నా.

క : తప్పకుండా !

సూ : నువ్వు ఈ విషయం బాగా పరిశీలించి, సహాయం చెయ్యాలని కోరుతున్నా.

క : నాకు చేతనైతే తప్పకచేస్తా సూర్యం !

సూ : నువ్వు చెయ్యగలవనే నా నమ్మకం. అందుకే నీతో అన్ని విషయాలు చెప్పాలని నిశ్చయించుకుని వచ్చాను— మీ నాన్నగారి పద్ధతులు ఏం బాగులేవు... ఈ వూళ్ళో రైతులందరి భూములు తన వంశానివని నమ్మి అందరికీ బలవంతాన అప్పులిచ్చి, చక్రవడ్డీలు కట్టి, అవి తీర్చటంలేదనే నెపంమీద తన స్వాధీనం చేసుకుంటున్నాడు. ఆయన చేతిలో మసి అయిన రైతులు ఇక్కడా, అక్కడా కూలిచేసుకుని ముష్టియెత్తుకు బ్రతుకుతున్నారు. మన ఊరిచివర ముసలయ్య జీవితం చూశావుగా ! ఆఖరికి ఆ పూరిల్లులోంచి కూడా గెంటేశారుట మోసంచేసి ! అతని స్థలం తన ఇంటివెనకాల దొడ్డికి పనికివస్తుందని ! — మా నాన్నగతికూడా అలాగే వుంది. భూములన్నీ తాకట్టులో వున్నాయి రేపో మాపో వేలం వేసుకుని స్వాధీనం చేసుకోవాలన్న

నాన్న. వీరన్న కొడుకు పొగరుమోతని వదంతి. ఈవేళ దరిద్రుడెల్ల ఎవరో ఒకరి కిచ్చి పెళ్ళిచేస్తే. ఎల్లాగ కష్టపడే దెవరు? మా కుటుంబానికి ఈ ఆర్థిక చిక్కులు పోవా లంటే నువ్వు సాయంచెయ్యాలి కనక!

రె: సూర్యం! మీ స్నేహితులు, ఇల్లు తాకట్టు విడి పించి, నీకు అప్పజెప్పే బాధ్యత నాది.

(శేషాచలం ప్రవేశం)

శే: హల్లో రెడ్డీ! సూర్యం కూడా ఇక్కడే ఉన్నాడే!

రె: ఏమోయ్ చలం! ఇలా వచ్చావు!

సూ: ఏమిటి దర్జాగా సూటులో దిగావు — ఎందు కొచ్చినట్టు! ఏమిటి విశేషం!

శే: ఏరొచ్చేసిందిరా! చెబుతా! నన్ను కొంచెం మర్యాద చెయ్యాలిసుమీ! నేనిప్పుడు ఒక ఆఫీసరుని! మీ గ్రామంమీద నన్నొక డెవ లప్మెంటు ఆఫీసరుగా వేశారు! ఒకప్రక్క మీ స్నేహం! మరోప్రక్క మీ ప్రజలసేవ! ఒక దెబ్బతో రెండు పక్షులు గిర్రున కింద బడ్డాయి! ఎల్లావుంది నా రాక!

సూ: చాలా సంతోషం.

క : నీ ఉద్యోగం ఏమిటిరా ఈ ఊళ్ళో ?

శే : ఈ ఊళ్ళోనే కాదోయ్ ! ఈ చుట్టుప్రక్కల గ్రామా లన్నిటిమీద ! మనకు చేతనైనంత ప్రజాసేవ చెయ్యాలి. ప్రభుత్వ పంచవర్ష ప్రణాళికలు చేసింది ! ఆ ప్రణాళికల క్రింద మన ఉద్యోగం ! ఈ గ్రామ ప్రజలను సాంఘికంగా, ఆర్థికంగా, వైజ్ఞానికంగా అన్నివిధాలా బాగుచెయ్యమని నన్ను పంపారు ! ఎల్లావుంది మన ఉద్యోగం !

క : చాలా బాగుంది.

శే : ఒరే ! జ్ఞాపకం వుందా ! మనం కాలేజీలో చదివే రోజుల్లో ఒకరోజు హాస్టల్లో పెద్ద తీర్మానాలు చేసుకున్నాం ! మనదేశం బాగుపడాలంటే గ్రామాలు బాగుచెయ్యాలి అని నువ్వు అన్నావు. వ్యవసాయం నష్టం కనుక జీవితమంతా రైతుగా బ్రతికి రైతుసంఘాన్ని ఉద్ధరిస్తానని ప్రతినపట్టాడు సూర్యం. నేను గ్రామాలలో నాయకుడుగా ప్రజాసేవ చెయ్యాలని తీర్మానించాను. నువ్వు డాక్టరుగా ప్రజలకు సేవచేస్తానని కంకణం కట్టావు ! మనం ముగ్గురం యిక్కడ కలుసుకున్నాం ! మనం చెయ్యవలసింది ఎంతైనా వుంది !

క : చలం ! ఆ మాటలు నాకు ఇంకా జ్ఞాపక మున్నాయి ! రైతుగా సూర్యం, డాక్టరుగా నేను జీవితాల్లో అడుగుపెట్టేం ! సమయానికి నీవు ఆఫీసరుగా గ్రామసేవ చెయ్యడానికి వచ్చావు ! మన గ్రామం ముందు ముందు నిజంగా ఎంత అభివృద్ధికి రావాలో కలలు కన్నాను యిన్నాళ్లు ! యీనాడు...

సూ : మన కలలు నిజమయ్యేలా మనం కృషి చెయ్యాలి !

(చిలకన్నను తలమీద దెబ్బతో, గుండయ్య తీసుకువస్తాడు).

గుం : బాబా ! ఓ రెడ్డిబాబా !

క : ఎవరది ?

గుం : నేను గుండయ్యని బాబా ! మా సిలకన్న తల పగలగొట్టిన్రు. వాళ్ళనోట్లో మట్టిబడా. ఉరికి పోయిన్రు సీకట్లోగాని నాయాల! మక్కలింగ కొట్టేవాణ్ణి కొంచెం వుంటే.

క : ఎవర్రా కొడతా ?

గుం : ఓపుంటాను బాబా ! మాకిద పగబట్టినోళ్ళు. గట్టిగా కూలి ఎక్కువ పెయ్యమండం తప్ప

యిపోనాది. నాయాల ! ఈసారి చెబుతా !
మావాళ్ళ అందరినీ పాడిపెట్టి సుక్కలిరగ
కొడితా !

సూ : ఎందుకు కొట్టారు ?

క : ముందు యిలా రా సిలకన్నా : దెబ్బకి గాయం
కట్టాక మాట్లాడదాం.

సి : అయ్యబాబోరా ! తల పగిలింది బాబా ! నెత్తురం
కారుతుందాది బాబో !

గుం : నన్ను కాడ ఒరుసుకున్నాది బాబో ! నేను
ఒక్కలావు ముందుకి వచ్చేసరికి సిల
రన్నది తగిలింది.

సి : నాకు తెల్సుబాబా ! ఇది అంతా ఆ గవరయ్య
గాడు సేయించాడు. రామసెట్టికాడ సుట్ట
కాలుస్త ఉంటుంటే ఏదో తెలియదను
కుంటాడు బాబో ! నాయాలా వాడిదినాలు తీరి
పోనాయి !

గుం : నాకు నా తమ్ముడు భీమిగాడు సెప్పిండుబాబా!
యెంకట్రావు, గవరయ్య కిందటిరేత్రి మాట్లా
డుకుంటున్నారట. నన్ను మెత్తగా తన్నాలని,
మిల్లులో గొడవసేత్తుండానని. పెయ్యకి ఏం

నేత్రాంబాబు పడుపు మాడుతుంటే, మా పడు
పులు కొట్టే రః డబ్బున్నోళ్లు బాగుందాలే;
రఃళ్ళుదినాలు దగ్గరపడుతున్నాయి బాబా. కన
రంగారయా మీరేమీ అనుకోకుండా ఉంటే
ఓటిపెబుతా ! మీరెంత మంచోరో పెద్దవార
అంత పెద్దోడు

సూ : గుండయ్యా సరేలే ఊరుకో అర్థమయిందిలే !
(కనకరెడ్డి కట్టుకడుతుంటాడు సిలకన్నకు)

శే : ఏమిటిరా అంటాడు యితను. బాబుగారు
పెద్దోరు అంటాడు.

సూ : చెబుతాలే తర్వాత అన్ని విషయాలు.

క : సరే చిలకన్నా రెండు రోజులునచ్చి కట్టు
కట్టించుకొని వెళ్ళు నయమవుతుంది.

గుం చి: సెలవుదొరా !

ర : రా చలం మనం భోజనానికి వెడదాం.

( తెర )

# నాలుగవ రంగము

(ఊరు చివరి చెరువుగట్టు - ఒక టేబిలు, మూడు కుర్చీలు - కూలీలు, రైతులు. అందరు ఎదురుగా గుమిగూడుతారు - సభ - సూర్యం, శేషాచలం, పుష్ప. కుర్చీల్లో ఉంటారు - తెర లేస్తుంది - చప్పట్లతో)

సూ : ఈనాడు మిమ్మలిని అందరిని పిలిచి యీ సభ చెయ్యగలిగి నందుకు చాలా సంతోషంగా ఉంది. చాలా రోజులు నుంచి గ్రామసేవకై వినియోగిద్దామనుకొన్న నా కోరిక యీ రోజు ఒక స్వరూపానికి వచ్చింది. మన గ్రామం అభివృద్ధి పచ్చడానికి యీ శేషాచలంగారు వచ్చారు. మీ అందరు ఎటువంటి సహాయం చెయ్యాలో మొదలైన విషయాలు శేషాచలం గారు మాట్లాడుతారు.

శే : సోదర సోదరీమణులారా !

సభల్లో అందరినీ‌సుంమ పొగిడేటట్లునన్ను అనవసరంగా పొగడకుండా నేను వచ్చిన పని క్లుప్తంగా చెప్పి, నన్ను మీకు పరిచయం చేసిన మిత్రులు సూర్యం గారికి నా నమస్కా-రాలు.

మిమ్మల్ని అందరినీ ఈనాడు కలుసుకోవ
డం చాలా సంతోషం. గ్రామాలు మన దేశా
నికి అటపట్టు. దేశాభ్యుదయ మంతా గ్రామాల
మీదే ఆధారపడి వుంది. వ్యవసాయం, పరి
శ్రమలను అభివృద్ధి చేసి వాటి ద్వారా ప్రజలకు
తిండి, బట్ట, ఉద్యోగం, యిల్లు అన్ని ముఖ్య
అవసరాలు పుష్కలంగా దొరికేలా చేసి,
వారిని వైజ్ఞానికంగా, ఆర్థికంగా, సాంఘికంగా
బాగుచెయ్యవలసిన అవసరం కాస్త చదువు
కున్న మా అందరిపైనా ఉంది. ప్రభుత్వ
కార్యక్రమాల్లో మీ ప్రజలంతా సహ
కరిస్తే మనం మన గ్రామాలను ఎంతయినా
బాగుచేసుకో గలం.

ఈనాడు జమీందారీ విధానం రద్దుచేస్తూ
దున్నే వాడికే భూమి కావాలనే సిద్ధాంతం
అమలు జరిపి, ధనికులైన జమీందారులను
సంఘంలోంచి తప్పించి, రైతు జీవితం అభి
వృద్ధి అయ్యేలా ప్రయత్నం జరుగుతోంది.
తరతరాలుగా వస్తున్న వృత్తులు వదిలి, ఉన్న
భూములు తెగనమ్ముకొని వృత్తులు యివ్వలేని
చదువులు చదువుకొని ఉద్యోగాలకి ఎగబ్రాకే
జనం యీ నాడు ఎక్కువ. అందుకే గ్రామాలు

స్వయం పోషకాలు గాకుండా నశించి పోతు
న్నాయి. కనుక మీ మీ కులవృత్తులు పెంపొం
దించుకుని పరస్పర సహకారంతో వ్యవసా
యం, పరిశ్రమలు అభివృద్ధి పరచాలని నా
కాంక్ష.

స్వయంకృషితో చదువుకుని అవినీతికర
మైన పడుపువృత్తి మాని తమ వున్న కొద్ది
ధనం ఖర్చుపెడుతూ బాలికల పాఠశాల నీ
గ్రామంలో శ్రీమతి పుష్పగారు నడిపిస్తున్నా
రని విని నాకు చాలా సంతోషం కలిగింది.
ఆమె భోగం కులస్తురాలు అని మీరంతా
మరోలా భావించక మీ పిల్లలని ఆమె స్కూలుకు
పంపి, తగిన విజ్ఞానం అందజేయుమని నేను
మిమ్మల్ని కోరుతున్నా. అసలు పాఠశాలలు
లేని ఈ చిన్న గ్రామంలో ఈమె ఒక బడి
నడిపించటం మీరందరూ ఎంతో మెచ్చుకో
వలసిన విషయం. శ్రీ సూర్యం గారు కూడా
బాగా చదువుకున్నా. వ్యవసాయం విలువ
గ్రహించి రైతుగా జీవితం గడుపుతూ గ్రామ
సేవ చెయ్యడం చాలా సంతోషం. మీరంతా
నేను ఈ గ్రామాల్లో చేసే కార్యక్రమాలలో
నాతో సహకరించాలని కోరుతున్నా. అంతే.

శ్రీమతి పుష్పగారు మాట్లాడుతారు.

పు : సోదర సోదరీమణులారా !

శ్రీ శేషాచలంగారు నన్ను గురించి ఎంతో చెప్పారు. వారికి నా ధన్యవాదాలు ధారల శ్రీ సీతికే చిహ్నంగని అవిసీతికి కాదు. తరతరాలుగా పడుపువృత్తి యే పొట్టపోటునో మా వంశాన్ని పాడుచేసినా నేను మాత్రం మా నీచవృత్తి చెయ్యదలచుకోలేదు. జీవితం గడవాలంటే కాయకష్టపడి పనిచేసి సంపాదించుకోవచ్చు. చదువుకుని ఉద్యోగం చేసుకోవచ్చు. నాకు దైవానుగ్రహం వల్ల కొంత ఆస్తి వుంది. అది పిల్లలబడికి సద్వినియోగం చేయాలని నా ఉద్దేశ్యం. పిల్లల సహాయనిధి సేకరించాలని ప్రయత్నిస్తున్నా. శ్రీ కనకరెడ్డి గారు కూడా ప్రభుత్వం ద్వారా కొంత సహాయం యిప్పిస్తానన్నారు. మీరంతా సహకరించి నేను నడిపే బడిని చదువుకునే పిల్లలతో కలకలలాడించమని కోరుతున్నా.

సూ : శ్రీ శేషాచలంగారు మీకు చాలా విషయాలు మనవి చేశారు. గ్రామాలు బాగుపడాలంటే, రైతుల బ్రతుకు హాయిగా ఉండాలి. ఎరువులు

దొరకక, భూమిని పంచించుకోడానికి గింజలు కొనడానికి తగిన డబ్బులేక, పశువులను రక్షించుకోడానికి తగిన వైద్యసహాయం లేక మనం ఎన్నో అవస్థలు పడుతున్నాం. మన అవస్థలు చూసి సంతోషిస్తూ మనల్ని పూర్తిగా ధ్వంసం చెయ్యాలని కొందరు ధనిక ద్రోహులు కాచుక్కూర్చున్నారు. వారి ఆటలు ఇక యెంతో కాలం సాగవు.

(చప్పట్లు)

(ఎల్లారెడ్డి, గవరయ్య, వెంకటాద్రి ప్రవేశం)

గవ : ఏమిటయ్యా? ఇష్టమొచ్చినట్లు మాట్లాడుతున్నావు? ఎవరయ్యా ఆ ధనిక ద్రోహులు? అసలు యిక్కడ మీరు సభ చెయ్యటానికి అనుమతి ఎవరిచ్చారు?

వెం : అవునయ్యా! ఊరిపెద్ద గవరయ్యను అడగక్కరలేదూ! రూల్సు ప్రకారం యిక్కడ సభ జరుగకూడదు. అది నాకు తెల్సు. మీకూ తెల్సుగా నా సంగతీ.

సూ : విన్నారా మీరంతా! ఈయన ఊరు పెద్ద! మీ కొంపలు కూల్చి మిమ్మల్ని నాశనం చెయ్యాలని చూస్తున్న ఈయన మీకు ఊరు

పెద. అమాయకులైన కూలీలను కూలి ఎక్కువ చెయ్యమని అడిగినంత మాత్రాన తలలు పగులకొట్టించే పెద్దమనిషి. బీదరైతు లను ధనికులకు తాకట్టు పెట్టి, వడ్డీలతో, అప్పు లతో ప్రాణాలు తీసే పెద్దమనిషి.

గుం : ఏమయ్యోయ్! గవరయ్యా! నీ తోవంటన నువ్వు పో! మద్దిలో అడ్డొస్తివా, మక్కలిరగ కొడతా! నాయాలా!

ఎ : ఏమిటి గుండయ్యా పేలుతున్నావు! నీ తాహ తెంత? గవరయ్య తాహ తెంత? తెలుసుకుని మాట్లాడు తున్నావా!

వెం : అసలు యిక్కడా సభ పెట్టమని ఎవరు అను మతి యిచ్చారయ్యా! గవరయ్యగారి అనుమతి లేందే ఈ ఊళ్ళో సభ చెయ్యకూడదు. నాకు తెల్సుగా గవరయ్యగారి సంగతి.

గుం : నీకు తెలవదా! దునియాలో అన్నీ నీకే ఎరుక. ప్రతీది తెలుత్తాది. మక్కలిరగతంతే నొప్పి మట్టుకు తెలియదేమో! నాయాల! సెక్కలాంటి మనిషి! అక్కరలేని ఊసు లేదు.

శే : గుండయ్యా! ఊరుకో! ఏమిటండీ మీరం టూంటా?

వెం : ఊరిపెద్ద గపటయ్యగారి అనుమతి లేందే యిక్కడ సభలు, సమావేశాలు జరుగకూడదు.

శే : నేను ప్రభుత్వం పంపిన ఆఫీసరుని. కావాలంటే ప్రభుత్వానికి ఫిర్యాదు చేసుకోండి.

గుం : మా బాగా చెప్పినారు

(చప్పట్లు, ఈలలు, కేకలు, హో హో వెంకటాద్రి !)

ఎ : నే నెవల్నో మీకు తెలుసుకునే మాట్లాడుతున్నారా ?

శే : తెలుసు కనుక నే మాట్లాడుతున్నా.

ఎ : నా వూళ్ళో నన్నెదిరించే వాడు నువ్వొక్కడవు కనుపిస్తున్నావు.

సూ : నేను మరొకడిని ! నిన్నెదిరిస్తా !

గుం : నేను ఇంకొకడిని.

(కేకలు, నేను మరొకడిని. అన్నంటవేహే ఊరి పెద్దలంట .. మాదబ్రోషలు)

వెం : రండి బాబు పోదాం. మనకెందుకు ఈ గొడవ.

గప : ప్రస్తుతం పదండి రెడ్డిగారు. ఇంటిదగ్గర యీ విషయం జాగ్రత్తగా ఆలోచిద్దాం.

(నిష్క్రమణ).

(మా పిచ్చోళ్ళు, పిచ్చందోయ్, కేకలు.)

వే : మీరు అల్లా గొడవ చెయ్యకూడదు. ద్రోహుల్ని కూడా చాలా కాలం వుంగా ఎదుర్కోవాలి. రేనాటికి యీ సభ వాయిద్దాం.

( తెర )

ఐదవ రంగము

(ఎల్లారెడ్డి ఇల్లు, పసారా, మూడు కుర్చీలు, ఒక టేబిలు ప్రక్కగా ఉంటాయి. గవరయ్య కూర్చొని ఉంటాడు. ఆలోచిస్తూ, వెంకటాద్రి మీద మేషాలు లెక్కపెడుతూంటాడు. ఎల్లారెడ్డి చిందులు త్రొక్కు తూంటాడు. తెరలేస్తుంది.)

ఎ : గవరయ్యా! ఇంక యీ పద్ధతిలో కనుక పరి స్థితులు మారిపోతూంటే మనం చిల్లిగవ్వకు కూడా పనికిరాం. మనుష్యుల్లో మునుపున్న భయభక్తులు పోయాయి. కూలివాడిని పిలిచినా పలుకడు. రైతును పిలిచినా మాట్లాడడు. మనుష్య అప్పులిచ్చి సహాయం చేశామన్న గౌరవమైనా లేదు! ఆలోచించవయ్యా గవ రయ్యా యేం చేస్తే బాగుంటుందో.

గవ : ఆలోచిస్తున్నా! ఎంతకీ ఆలోచన తెగడం లేదు. మనకి యీ చలం ఒకడు కొత్తగా ఊడి పడ్డాడు కదా! గ్రామప్రజలని బాగుచేయడానికి వచ్చా నంటాడు! ప్రభుత్వం ఆఫీసరు నంటాడు. ఎవరెవరినో తీసుకువస్తాడు. ఏమిటేమిటో చేస్తాడు. కొత్తగా పోస్టాఫీస్ పెట్టించాడు. కో-ఆపరేటివ్ స్టోర్సు పెట్టించాడు. ఆ నక్కలంక వైపు రోడ్డు బాగుచేయించాడు. చెరువువైపు సభలకోసమని చప్టా వేయించాడు. ఒక రాయి వేయించాడు. ఏమిటేమిటో చేసేస్తున్నాడు. ఈ వూరు వాడి స్వంతంలా!

వెం : అదికాదండీ! అ భోగంపిల్ల బడిపెట్టలేదూ! అందులో పిల్లలచేత నాటకాలు వేయిస్తు న్నాడు. ఒకనాడు యెవరినో సూటు మనిషిని తీసుకువచ్చి, ఈ వూరి పొలాలన్నీ చూపించాడు. రైతులంతా వెళ్ళారు. ఏం జరిగిందో తెలియదు.

ఎ : ఏమయ్యా గవరయ్యా! ఇంత తతంగం జరుగు తున్నా మనకి ఆహ్వానం లేదు, విసర్జనాలేదు. ఏమటి యిందులో పరమరహస్యం. పైగా ఆ భూమన్న ఉన్నట్లుంది అరు వేల అప్పు

హఠాత్తుగా తీర్పేశాడు. ఏమి కింద దబ్బెక్కడి దోయి? వీడి భూములు వేలం వేద్దామను కుంటున్నాం. వీధిలో పోతుంటే ప్రతివాడు నిరసనగా చూడటమే. గుండయ్యను కొట్టించి పట్లు కొంపతీసి అందరికీ తెలిసిపోయిందేంటి. వెధవ కూలి పెంచమంటాడు. పెంచితే ఏడా దికి పదివేలు నష్టం రాదుటోయ్ !

వెం : చూస్తూంటే పరిస్థితులు విషమిస్తున్నా యని తోస్తూందండి. మనం కూడా కాస్త మెత్త బడాలేమో అని అనిపిస్తూందండి నాకు. మీకు తెల్సుగా నా సంగతి. మరోలా మాత్రం అను కోకండి.

గ : అసలు వీటి కన్నింటికి మూలకారకుడు ఆ సూర్యంలా తోస్తున్నాడు. పట్నం నుంచి ఏవో రెండు కాగితాలు చదివొచ్చి యిక్కడ పెద్ద గొప్పవాడిలా మాట్లాడుతున్నాడు. ఎంత పొగ రండీ వాడికీ. మన గుండయ్యని వాళ్ళని రెచ్చగొడుతున్నాడు వీడే. వీడిని ఈ ఊళ్ళో మంచి మాయం చేస్తే కొంతవరకు మన పరి స్థితులు బాగుపడతాయి. అందుకే అంతా ఏర్పాటు చేయించానులెండి.

వెం : అది అంత సులభం కాదోయ్. కనకరెడ్డి బాబు, అతను చాలా స్నేహితులు. ఇద్దరూ ఎప్పుడూ కలిసే ఉంటారు.

ఎ : మా వాడు అస్తమానూ ఆ ఆసుపత్రిలోనే ఉంటున్నాడు కదటోయ్! ఆసుపత్రి చాలా పెద్దది చేయాలని కావాలంటే పదివేలు కూడా ఇచ్చాను. దానితోనే వాడికి రోజల్లా సరిపోతోంది. ఈ ఊళ్ళ గొడవలు వాడికి అక్కర్లేదండి!

వెం : ఏమో బాబూ! కనకరెడ్డి గారిని అర్థం చేసుకోడం కష్టం. మరేమీ అనుకోకుండా ఉంటే మీతో ఓ సంగతి చెబుతా! ఓ రోజు సాయంత్రం కొంచెం సీకటి పడ్డాక మీ అబ్బాయిగారు, పుష్ప ఊరి చివర చింతచెట్టు దగ్గర నుంచుని ఏ వేవో మాట్లాడుకుంటున్నారు. మరి ఏమిటేమిటో?

ఎ : మా వాడు చాల బుద్ధిమంతుడోయ్! అటువంటి పనులు చెయ్యడుగా! ఒక వేళ చేసేడే అనుకో అదొక భోగంది! దానికి నీతి నియమాలు ఉంటేగా!

వెం : అబ్బొబ్బో! అల్లాగనకండి. ఎవరినీ ఇంటికి

రానీయను. ఎవరినైనా పెళ్ళి చేసుకోవాలని
[illegible]. [illegible] .. [illegible] మాత్రం
ఆ అమ్మాయి [illegible] చూడండి!

ఎ : అబ్బా! [illegible] నాటకాలాడుతున్నారూ!

వెం : అందుకే [illegible] ఇస్తున్నా
[illegible] నాకు అనుమానంగా వుంది. అతనికి
ప్రమాదం జరిగించడం అంత సులభం కాదం
డోయి! తమరు జాగ్రత్తగా ఆలోచించండి.
నా మాటలో నిజం తెలుస్తుంది. మీకు
తెల్సుగా నా సంగతి.

గ : పోనీ ఒక పనిచేస్తే! గుండయ్యని పిల్చి వాడికి
లంచమిచ్చి మనవైపు త్రిప్పుకొని వాడిచేత
సూర్యాన్ని కొట్టిస్తే...

వెం : భలే ఆలోచన! గవరయ్యగారి బుర్ర బహు
షట్టిది....నాకు తెల్సుగా గవరయ్య గారి
సంగతి!

ఎ : అయితే వెంకటాద్రి! గుండయ్యని నేను తక్షు
ణం రమ్మన్నానని కబురంపు!

(వెంకటరెడ్డి వెళ్ళబోతుంటాడు)

(తెరలో కూలిసంఘానికి జై! కూలి ఎక్కువ

చెయ్యాలి, బోనసులు యివ్వాలి—కూలోళ్ళంతా ఏకం కావాలి. కూలి సంఘానికి జై !)

వెం : ఏమండోయి యీ కేక లేమిటి ?

గ : చూడు వెంకటాద్రి! చూడు ఏమిటో!

ఎ : గుండయ్య కేకల్లా వున్నాయి !

వెం : మీ మిల్లు కూలి వాళ్ళల్లా వున్నారండీ. పెద్ద ఊరేగింపుగా వస్తున్నారు. చేతుల్లో కర్రలున్నాయండీ !

ఎ : కర్రలున్నాయా ఇక్కడికే వస్తున్నారా ?

వెం : ఆ మీ ఇంటిపై పే వస్తున్నారు.

( తెరలో కేకలు )

ఎ : ఏం చేద్దాం గవరయ్యా!

గ : అదే ఆలోచిస్తున్నా.

వెం : ఏం చెయ్యగలం. ఇంక ఏమీ చెయ్యలేం!.... వాళ్ళంతా మనల్ని చితక్కొడితే! నాకు తెల్సునండీ వాళ్ళ సంగతి....వాళ్ళకి తెల్సునండి మన సంగతి !

ఎ : మన ఇంట్లోనే మనల్ని కొడతారా గవరయ్యా!

గ : ఏమండీ ఈ ఇంటికి దొడ్డిదారి లేదా !

ఎ : నన్ను ఒక్కడిని విడిచి వెళ్ళిపోతావా గవరయ్యా !

వెం : ఏం చేస్తామండీ! ఆపత్సమయంలో స్వంతపని కోసం ఏ పనైనా సరే చెయ్యమన్నాడు.

గ : ఎవరు ?

వెం : ఎవరేమిటి! ఒక సిద్ధాంతం! పద గవరయ్యా! ఆ దొడ్డి దారిని మనం బయటికి పోదాం! ఆ కూలీలు, ఈ యజమాని మాట్లాడుకోనీ ! మధ్యన మన మెందుకు ?

ఎ : ఎప్పుడూ లేవి ఊరేగింపులు ఈ రోజునే వస్తు న్నాయి! ఏమిటి?

వెం : కాలం మారింది బాబూ ! మారి పోయింది ! నాకు తెల్సుగా కాలం సంగతి !

ఎ : వెళ్ళిపోతున్నారా గవరయ్యా!.... వెళ్ళండి! నే నొక్కణ్ణే చూసుకోగలను నా సంగతులు !

వెం : వస్తామండీ ! మీకు తెల్సుగా మా సంగతి !
(వెనకదారిని నిష్క్రమణ)

(ఎల్లారెడ్డి ఒంటరిగా కంగారుగా తిరుగుతాడు గుండయ్య, చిలకన్న ఇంకా కొందరు కూలీలు ప్రవేశం, కేకలు)

ఎ : ఏమిట్రా ఆ కేకలు! ఎందుకీ ఊరేగింపులు !

గుం : ఎందు కంటావేందయ్యా! మా కూలీ ఎక్కువ

సెయ్యాలి! లేకుంటే యీ యేళ నుంచీ సమ్మె కడుతున్నా!

ఎ: సమ్మె! చెయ్యండి! నన్ను బెదిరిస్తారా! మీరు పని చెయ్యకపోతే పక్క ఊరినుంచి పదివేల జనం తీసుకు రాగలను.

గుం: తమరు తెత్తారు! పైసున్న మారాజు! కాని మా కడుపులు నింపడానికి సూడరు! సూత్తాంగా! ఎవడొచ్చి మిల్లులో పని చేత్తాడో! అబ్బో! మునుపటి దినాలు వెళ్ళిపోయినవి దొరా!

ఎ: వెళ్ళండి వెళ్ళండి. పెద్ద ఊరేగింపు తీస్కొ వచ్చారు. మిమ్మలిని చూసి భయపడిపోతే యింక వ్యాపారం చేసేదేమిటి?

గుం: యింకొక మాట, ఆ నాడు సన్ను కొట్టిం చేంద్రుగందా! దానికేమంటావు అంట.

ఎ: నిన్నెవడు కొట్టించాడో! యీ పూళ్ళో నీకు ఎంతమంది శత్రువులున్నారో!

చి: నిన్నొక్కణ్ణే కాదురా! ఆ దెబ్బలు నాకు తగిలినవిగందా! యీ వేళ ఆ సూర్యంబాబును కూడా కొట్టిండంట్రా!

ఒకడు: యీ రెడ్డి మారాజుకు దెబ్బలెట్టింటయో జర్ర సూపియ్యాలిరో అప్పటికి గాని ఎరుకకురాదు యవ్వారం.

ఎ : నన్ను కొడతాన్నట్రా! నా మిల్లులో పనిచేస్తూ నా మీద తిరగబడతాన్నట్రా! నా కూలి తింటూ. నన్ను హేళన చేస్తాన్నట్రా! మిమ్మల్నివి ఏం చేస్తానో చూసుకోండి!

గుం : ఏందయ్యా సేసేది. ఆ పినకంటోరి మొకం చూసి ఊరుకుంటున్నా యీ యేళకు! ఏం దమ్మోయ్! లేకుంటేనా?

ఎ : ఓ హో! శ్రుతిమించింది. మీకు ధైర్యముంటే కొట్టండి చూస్తాను.

గుం : ఏం దయ్యా మాలావు నీల్గుతున్నావు! అందరం కలిసి సావదంతే నీ మిల్లు, నీ యిల్లు నిన్నూ అంతా పిండి పిండీ సేసెయ్యగలం!

(మీదకి కఱ్ఱ ఎత్తుతాడు సూర్యం తలకట్టుల్తో. కనకరెడ్డి ప్రవేశం)

కనక : గుండయ్యా!

గుం : (గబుక్కున కఱ్ఱ దాచేస్తాడు) మన్నించు దొరా. మీ నాయనగారు మా నిబ్బరంగా మాట్టాడుతున్నారు! మమ్మల్నందరినీ ఏందో సేసేస్తారట.

క : ఊరుకో గుండయ్యా! ఏమిటీ ఘర్షణనాన్నా.

ఎ : చూడరా! కూలి చేసుకు బ్రతికే వీళ్లకు కళ్లు నెత్తికెక్కాయి నన్ను కొట్టడానికివచ్చారు.

క : అవును. యీ వేళ కొట్టడానికి వచ్చారు. రేపు నిజంగా కొడతారు కూడా! వాళ్లకు కాదు కళ్ళు మూసుకుపోతే! మనకి యివ్వవలసిన కూలి యివ్వకుండా వాళ్ల కడుపులు కాల్చి, మన కడుపులు నింపుకుందామనే అన్యాయం తలపెట్టి బాగుపడదామనుకున్నంత కాలము వాళ్ళు ఎదురు తిరగవలసిందే! ధన సంపాదనకు కూడా ఒక పరిమితి, పద్ధతి ఉంది. మిల్లులో గొడవచేస్తున్నాడని గుండయ్యని కొట్టించలేదూ? రైతు జనానికి సహాయం చేస్తూ మీ అప్పుల బారినుండి తప్పిస్తున్నాడని సూర్యాన్ని కొట్టించలేదూ? దుండగాలు చేసి ఎంత కాలం నెగ్గుకొద్దామనుకుంటున్నారు?

ఎ : ఎవరు కొట్టించార్రా! నువ్వు కూడా వాళ్ల పక్షాన మాట్లాడుతున్నావు.

క : ఎవరు కొట్టించారు! అబద్ధాలెందుకు! నువ్వే!!

ఎ : నేను కాదు. వాళ్ళంటే ఇష్టం లేనివాళ్ళు ఎవరో కొట్టారు!

క : నేను ఋజువు చూపిస్తాను. ఇన్నాటి అన్యాయాలు యీ నాటితో నైన అంతరించాలి.... ఆ వెంకటాద్రిని, గవరయ్యని, ఇలా తీసుకు రండి.

(కూలీలు వాళ్లని తాళ్ళతో కట్టి తీసుకువస్తారు)

క : ఏమండీ! గవరయ్యగారూ! ఊరి పెద్దగా ఇటువంటి అఘాయిత్యాలా మీరు చెయ్యవలసింది! మా తండ్రికి మోసం నేర్పి దానిద్వారా మీరు డబ్బు సంపాదించుకుని పొట్ట నింపుకోడమేనా ఊరి పెద్దరికం. వూళ్ళో ప్రజలలో కలతలు, కొట్లాటలు మనస్పర్ధలు లేపి వాటి ద్వారా మీరు బాగుపడడమేనా ఊరిపెద్దరికం, అమాయకులైన బీద కూలీలను, రైతులను ఏడిపించి ఎంత ధనం సంపాదించారు! అడిగే వాడు లేకనా!

గ : (గవరయ్య తలవంచుకు నుంచుంటాడు)

వెం : నేను ఏ తప్పు చెయ్యలేదు. అందరి బాగు కోరడమే నా పద్ధతి. మీకు తెల్సుగా నా సంగతి.

క : తెల్సు మీ సంగతి నాకు తెలుసు! పూర్తిగా తెలుసు. అందరి బాగునుకోరే మనుష్యులు. యీ కూలీల ఊరేగింపు చూసి దొంగ

తనంగా దొడ్డి దారిని పారిపోవడం ఎందుకు ? నిర్భయంగా ఎదుటకు ఎందుకు రాలేక పోయారు ? పనిలేని బిత్తుల మారి ! పిల్లకూ వాళ్ళకు కిలహోలు పెట్టి గ్రామ ప్రజల ఐక్యత నాశనం చేసే చెదపురుగు. మర్యాదగా మిమ్మల్నిద్దర్నీ యీ రోజుతో వదిలివేస్తున్నాం లేక పోతే ఒళ్ళు హూనం చేయించే వాణ్ణి ఈ కూలీలచేత ! విడవండి వీళ్ళని !!

( కట్లు విప్పేస్తారు )

వెం : కనకం బాబు మంచి వాడు ! నాకు తెల్సుగా ఆయన సంగతి.

గుం : నోరు మూసుకోవయ్యా ! లేకుంటే నీకు తెల్సుగా నా సంగతి.

వెం : ఆ....ఆ....తెల్సు

కి : మర్యాదగా చెబుతున్నా....ఈ కూలీల కూలి పెంచండి. అన్ని మిల్లుల్లో ఇచ్చేటట్లే వీళ్ళకీ ఇవ్వండి. ప్రతి ఏడు బోనసులు మామూలుగా పంచి పెట్టండి. వాళ్ల కాయ కష్టానికి తగిన విలువకై ప్రాధేయ పడడం వారి హక్కు. లక్షలు ఇంట్లో మురుగుతున్నా మురికిలోని పైసలు వెతుక్కోవడం మనకు సిగ్గుచేటు.

ఎ : నేను ఇవ్వను ; నువ్వెవరవు నాకు నీతులు నేర్పడానికి; డబ్బు విలువ తెలియకపోతే సరి, సమ్మె చేసుకోండను ; నేను నడిపిస్తా మిల్లు.

క : సమ్మె వాళ్ళు కాదు చేసేది...నేను చేయిస్తా! కూలీలకు నాయకత్వం నేను తీసుకుంటా ; ఎంతకాలం ఏ విధంగా నీ మిల్లులు నడుస్తాయో నే చూస్తా ;

(కనకంగారికి జై ; కేకలు)

సమిష్టిగా ఎవరి వ్యక్తిత్వం వారు నిలుపుకుంటు పరస్పర సహాయంతో శాంతి యుతంగా బ్రతక వలసిన ప్రజాస్వామ్య దినాలు యివి. ధనికుల దౌర్జన్యాలు గ్రామాలను నాశనం చేసే రోజులు పోయాయి. మన వూరు బాగుపడితే మనకి ఆనందం కాదూ ; మనం ఒక్కళ్ళం బాగుపడి మనవాళ్ళంతా నాశనమైపోతే నీకు సంతోషమే, స్వార్ధానికి పరిమితి ఉండాలి. మితిమీరిన స్వార్థంతో సమాజంలో నువ్వెప్పుడూ బ్రతుక లేవు పీ కూలీల బాగు నువ్వు జాగ్రత్తగా చూస్తే వాళ్ళు ఉత్సాహంగా పనిచేస్తారు. నీ మిల్లుల ఉత్పత్తి పెరుగుతుంది. నీకు కూలీలకు లాభ దాయకమౌతుంది.

ఎ : నీ కెందుకురా ఈ గొడవలు. నీ ఆసుపత్రి విషయములు నువ్వు చూసుకో! అది బాగు చేసుకోడానికి నీకు పదివేలు ఇచ్చేగా! నా స్వంత విషయాల్లో నువ్వు కలుగజేసుకోకు.

క : ఇది మీ ఒక్కరి విషయమేమీ కాదు. ఈ వూరి అందరికీ కావలసిన విషయం. మీ దగ్గర పది వేలు ఆసుపత్రికోసమని తీసుకోలేము. భూమన్నను మీ అప్పుల బారినుంచి తప్పించడానికి, కొంతమంది రైతులకు ధన సహాయం చెయ్యడానికి తీసుకున్నా! డబ్బో్ళ్ళ రైతుల్ని అన్యాయం చేస్తుంటే నే చూస్తూ ఊరుకోలేను. మిమ్మల్ని అందరు అసహ్యించుకుంటూంటే అది నాకు సిగ్గుచేటు!

ఎ : ఇదిట్రా నువ్వుచేసిన పని! అందుకా భూమన్న ఆరు వేల అప్పు ఒక్కసారి ఇచ్చేశాడు! (సూర్యం వైపు తిరిగి) ఇందుకా బాబూ మా వాడితో స్నేహంచేసి మాయ కబుర్లు చెప్పి మోసం చెయ్యడానికా!

సూ : మీరు మాటలు జారకండి! అసలు విషయాలు మర్చి...

క : నా యిష్ట ప్రకారం నేను చేస్తున్నా! ఒకళ్ళ మాటలు వినవలసిన అవసరం నాకు లేదు.

ఎ : నా డబ్బు యిల్లూ తగలేసే పక్షంలో నువ్వు ఒక్క క్షణం నా యింట్లో ఉండడానికి వీల్లేదు.

క : ఇంట్లో ఉండవద్దు అంటే తక్షణం వెళ్ళిపోతా! కాని మీరు మాత్రం నేనుండగా ఇక్కడ అన్యాయాలు జరప డానికి వీల్లేదు. మీరేం చేసినా నేను ధిక్కరిస్తాను. ఈవేళ ఇంట్లోంచి బయటికి వెళితే నా మంచితనం నన్ను కాపాడుతుంది. నన్ను ఆదుకోడానికి సూర్యం ఉన్నాడు. నేను పెళ్ళిచేసుకోబోయే పుష్పం వుంది. నా కాళ్ళమీద నేను నిలబడి బ్రతక గలను.

ఎ : పుష్ప! భోగందాన్ని పెళ్ళి చేసుకుంటావా!

క : ఆ చేసుకుంటాను. ఆ విషయంకూడా చెబుదా మనుకుంటున్నా మీతో. శీలం నిలుపుకుని మన పిచ్చివ స్త్రీని పెళ్ళి చేసుకోడానికి కుల మతాలు సాంప్రదాయాలు అడ్డు రాలేవు. మీరేమన్నా సరే పెండ్లి అయి తీరుతుంది.

ఎ : నువ్వు నా ఇంట్లో ఒక క్షణం వుండడానికి వీల్లేదు. డబ్బు తగలెయ్యడం, వంశ ప్రతిష్ఠలు గంగలో కలపడం! ఇదిట్రా నువ్వు చేస్తు న్నది — ఇంతకాలం! ఇటువంటి కొడుకు నా కున్నా ఒక్కటే, లేకున్నా ఒక్కటే! తండ్రిని

ఆదుకోవలసిన కొడుకు ఊళ్ళో వాళ్ళని రక్షిస్తానంటాడు...వెళ్ళు - తక్షణం వెళ్ళు నా ఇంట్లోంచి.

క : ఆ ! ఇప్పుడే వెళ్ళిపోతా ! పదండి సూర్యం, గుండయ్యా !

( అంతా నిష్క్రమణ )

గ : అబ్బాయిగారి మనసు ఎవరో చెడగొట్టేశారు.

వెం : ఇంకెవరూ ! ఆ భోగండి ! ఈ భూషన్న కొడుకూను. నాకు తెల్సుగా వీళ్ళసంగతి.

ఎ : నీకు తెల్సునోయి! ప్రపంచంలో ప్రతీదీతెల్సు నోయి! మీ మూలానే ఈ వూళ్ళో అందరికీ శత్రువునై పోయాను. చివరకు ఒక్కగా నొక్క కొడుకు కూడా ఎదురు తిరిగాడు. వెళ్ళండి మీ రెండుకిక్కడ...వెళ్ళండి.

వెం : పదవోయి గవరయ్యా! ఇంకెందుకు ఇక్కడ. ఇతనూ మారిపోయాడు. నాకు తెల్సుగా రేపు ప్రొద్దున్న తండ్రీ కొడుకూ ఒక్కటే అవు తారు...నాకు తెల్సుగా వీళ్ళ సంగతి.

ఎ : మీకు తెలియందేముంది? వెళ్ళండి తక్షణం నా ఇంట్లోంచి.

(గవరయ్య, వెంకటాద్రి నిష్క్రమణ, ఎల్లా రెడ్డి విచారంగా కూర్చుని ఉంటాడు. నర సింహం వస్తాడు )

న : (మెల్లిగా వచ్చి) చలంబాబుగారు మీ కీ శుభ లేఖ ఇమ్మన్నారు.

ఎ : శుభ లేఖా! ఏమిటిది!

న : పెండ్లి!

ఎ : ఎవరి పెళ్ళి ?

న : కనకం బాబుగారిది.

ఎ : ఆఁ ఏమిటన్నావు! కన్న తండ్రి ఎరగకుండా కొడుకు పెళ్ళా! నాకు తెలియకుండా శుభ లేఖల దాకా వచ్చిందీ!

న : అందుకే మీకు లేఖ అందిమ్మన్నారు.

ఎ : (చదివి) ఆ భోగందానితోటా పెళ్ళి! ఎట్లా జరుగుతుందో నే చూస్తాగా! ఎక్కడ జరుగు తుంది?

న : కొత్తగా చెరువుగట్టు మీద లైబ్రరీ కడు తున్నారు కదండీ! ఆ క్రొత్తలైబ్రరీ తెరిచి ఈ వివాహం అక్కడ చెయ్యాలని అను కుంటున్నారండి !

ఎ : వంశ ప్రతిష్ఠలు నాశం చేస్తున్నాడు! నాకు

పుట్టిన కొడుక్కి ఇటువంటి చెడు బుద్ధులు ఎల్లా పుట్టాయా అని!

న : పుష్ప భోగం పిల్ల అయినా చాలా మంచి మనిషండి !

ఎ : చాల్లే! నువ్వు నాకు చెప్పొచ్చావు! మీరంతా ఒకటే. నీలేఖ నువ్వే తీసుకుని బయటికిపో.... ఊ... వెళ్ళు! (లేఖ విసిరి వేస్తాడు)

న : చిత్తం (నిష్క్రమించును)

ఎ : చూస్తాను. ఈ పెళ్ళి ఎలా జరుగుతుందో.... ఎల్లారెడ్డి అంటే ఏమిటనుకుంటున్నారో!...

(దుఃఖంతో) అవును, ఎల్లారెడ్డి ఎవరు? ఆలోచిస్తే ఎంత అన్యాయం చేశాను రైతులకు! కూలీలకు! ఒక్క కొడుకు ఎదురు తిరిగితే ఎలా బ్రతకగలను? నన్ను ఆశ్రయించుకు తిరిగేవారు స్వార్థపరులు. మన శ్శాంతి లేనిదే బ్రతుకు ఏ సుఖం....అంతా అగమ్యంగా, బాధగా వుంది!!

( తెర )

( ఆఱవ రంగం )

(గ్రంథాలయం జనం కిటకిటలాడు తుంటారు)
(పుష్ప కనకరెడ్డి కుర్చీలో ఉంటారు)

శే. చ. నే ఈ వూరు వచ్చి ఏడాది కాకుండానే మన గ్రామం ఎంతో పురోగమించింది. ఇక్కడ ఎంతో ఉత్సాహంగా గ్రామాభివృద్ధి కార్యక్రమాలు చేసామంటే, దాని కంతకీ కారణం మీరే. మిత్రులు శ్రీ కనకరెడ్డి, శ్రీ సూర్యం, శ్రీమతి పుష్ప గారు కూడా చాలా సహాయం చేశారు.

ఈ క్రొత్త లైబ్రరీ ఈ నాడు మనం తెరుస్తున్నాం. బీదరికంతో అవస్థపడే పేద రైతులు, కూలీలు, పెద్దలు అంతా వారి తీరుబడి సమయాల్లో యిక్కడ చదువుకోవచ్చును. ప్రభుత్వం స్థలం ఇచ్చింది. గ్రామ ప్రజలంతా చందా వేసుకున్నారు. ఉత్సాహ వంతులైన గ్రామ యువకులు నడుం కట్టి ఖాళీ సమయంలో దీని గోడలు నిర్మించారు. పట్నం లోని నాగరిక ధనికులు పుస్తకాలు దానం చేశారు. ఒక గ్రంథాలయం తయారయింది.

ఇదంతా మీ కృషే. పరస్పర సహాయంతో ప్రజలు ప్రభుత్వం పనిచేస్తే ఇటువంటి నిర్మాణ కార్యక్రమాలు ఎన్నో జరుపవచ్చు. నిరక్షరాస్యత రూపు మాపడానికి ఇది ఒక సాధనం. ఇటువంటి సమిష్టి కృషితోనే తపాలా ఆఫీసు ఇక్కడికి తెచ్చుకున్నాం. సభలు జరుపుకోనిడాకి ఒక వేదిక నిర్మించు కున్నాం. తోటి రైతులు భూములు బాగు పడేలా ప్రభుత్వ సహాయంతో ఎరువులు తెచ్చుకున్నాం. మన ఊరి చివరి మాల గూడేలు మనమే శుభ్రంచేసి వారి జీవనం బాగు చేశాం. పని లేని గూడెం మనుష్యులకు అతి తక్కువ ఖర్చుతో కుటీర పరిశ్రమలు నేర్పాం. ఒక స్టోర్సు, రైతుల సహాయానికి ఒక తణకా బ్యాంకును సహకార పద్ధతిని నిర్మించుకున్నాం. కలిసి మెలిసి పనిచేస్తే మనం సాధించలేనిది ఏదీ లేదు. అందుకు ఈ నాటి గ్రంథాలయమే ఒక చిహ్నం.

గ్రామాల అభివృద్ధికి మనం బాహ్యంగా ఎంత బాగుపడాలో, మానసికంగాకూడా మనలో అంతమార్పు రావాలి. సంకుచితత్వం నశించాలి. ప్రజ అందరు ఒకటి. మతాలు కులాలు మన

నమ్మకాలపై మనం నిర్మించుకున్నవి. మను
ష్యులకు కావలసింది విశాల దృష్టి. మన
సులు కలిసిన స్త్రీ పురుషులు హాయిగా బ్రతుకు
తేనే మన సమాజం బాగుపడుతుంది. హృద
యాలలోని అభిమానానికి, అంతరాలు, కులాలు
మతాలు అడ్డు రాకూడదు. ఈ నాడు ఉదా
త్తమైన దృక్పథంతో శ్రీ కనకరెడ్డి గారు
ఒక శీలవతియైన భోగం కులస్థురాలిని వివా
హం చేసుకోడం మన మంతా సంతోషించ
వలసిన విషయం. మనుష్యులంతా ఒకటే
ఐనప్పుడు కులాలు ఏం చెయ్యగలవు? రెడ్డి
గారి విశాల మనస్సుకు ధన్యవాదా లిస్తూ
నూత్న దంపతులకు అభినందనలు తెల్పు
తున్నాను.

(దండలు వేసుకుంటారు, రెడ్డి, పుష్ప.)

చప్పట్లు

సూ : మన గ్రామాన్ని అభివృద్ధి చేయడానికి వచ్చిన
శ్రీచలంగారు అన్ని విధాల మన బాగుకు
పాటుపడుతున్నారు. ఈ ఊళ్లో ఒక బీదరైతు
కూతురుని పెళ్ళిచేసుకుంటానని అన్నారు.
శ్రీ చలంగారు నా బావమరది కాబోవడం

ఎంతో గర్వకారణం. గ్రామ ప్రజలకే ఇది ఒక శుభ వార్త.

( చప్పట్లు )

క : నాకు మొదటి నుంచీ మన గ్రామాన్ని బాగు చెయ్యాలనే కాంక్ష ఉంది. అందుకే డాక్టరు పరీక్ష ప్యాసయి, నాకున్న ధనంతో మీ గ్రామ ప్రజలకు ఉచిత వైద్య సహాయం చెయ్యాలనే కోరిక ఉండేది. అది ఈ నాటికి ఒక రూపం పొందింది. నా తండ్రి చేసే అన్యాయాలు నన్ను కూలీల స్థితి బాగుచెయ్యడానికి అవకాశమిచ్చింది. కూలీలంతా ఐకమత్యంతో మసిలితే ధనిక యజమానులు వాళ్ళ నేమీ చెయ్యలేరు.

(చప్పట్లు )

కూలీలు, యజమానులు, రైతులు, భూకామందులు, ధనికులు దరిద్రులు ఈ ప్రజాస్వామ్యయుగంలో సమాన హక్కులు వ్యక్తిత్వం కలవారు. కులాలు మతాలు విభేదాలు కలిగించి ప్యలనుమను విడదీయలేవు. అందుకే యీ నాడు నేను శ్రీమతి పుష్పను వివాహం చేసుకున్నాను. మీ ఆశీస్సులకు నా అభివందనములు.

(సభలో గుసగుసలు అందరు తెల్లబోయి చూస్తుంటా.)

( ఎల్లారెడ్డి ప్రవేశం )

చ : రండి! రెడ్డిగారూ! యిప్పుడే మీ కుమారుని వివాహం జరిగింది. మీరు కూడా ఆశీర్వదించాలి.

ఎ : కనకం !

క : నాన్నా !

ఎ : (బాధగా) నేను ఎన్నో పాపాలు చేశాను. కన్న కొడుకును ఇంట్లోంచి గెంటేశాను.

క : జరిగి పోయిన దానికి బాధపడ నక్కరలేదు. ప్రశ్చాత్తాపం మనుష్యుల్ని పవిత్రం చేస్తుంది.

ఎ : నువ్వు, పుష్ప పెళ్ళి చేసుకున్నందుకు నాకు చాలా సంతోషం. నీ అభ్యుదయ భావాలు నేను అర్థం చేసుకోలేకపోయాను. చెడు మనుష్యుల సాంగత్యంలో చెడు బుద్ధులు కలిగి యీ గ్రామాన్ని ఎంతో పీడించాను. నా పాపాలు పోగొట్టి మన వంశానికి కీర్తి

తెచ్చావు. ఇక నుంచి నా ఆస్తి అంతా నీదే।
నీ యిష్టమొచ్చినట్లు చేసుకో.

శే. చ ఎల్లారెడ్డి గారు నిజంగా ఉదారస్వభావులు.

ఎ : నా పశ్చాత్తాపానికి చిహ్నంగా ఈ ఊరి పుంత చివరఉన్న పాతిక ఎకరాలు భూమి ఈ ఊళ్ళో బీద రైతులకు దానం చేస్తున్నా. దాని బాధ్యతంతా శ్రీ చలంగారికి అప్పజెబుతున్నా। నా వల్ల పాడైన రైతులు ఇప్పుడు కొంత మందైనా బాగుపడతారు.

సూ : అంతరాలు నశించాలంటే ఔన్నత్యంలో ఉన్న వారు అధఃపతితుల నాదరించి సహాయం చెయ్యాలి. తాను దున్నుకోలేని భూమిని దున్నుకునే రైతుకి ఇస్తే భూమి బాగుపడుతుంది. పంట పెరిగి అభివృద్ధి చెందుతుంది. సర్వ సమానమైన ప్రజలు సమాజంలో ఉండాలంటే ఉదారమైన ధనికులు భూదానోద్యమం మొదలు పెట్టాలి. ఎల్లారెడ్డి గారు మన గ్రామంలో ఈ విషయంలో ముందడుగు వేసినందుకు వారికి నా ధన్యవాదాలు.

సంకుచితత్వంలో, అనైక్యతతో, స్వార్థంలో నలిగి, చితికి, కడపటి చిహ్నంగా

నశించిపోతున్న మన గ్రామం, కొత్త తళు
కులతో, నవ జీవంతో నేడు చైతన్యవంతమై
కదిలింది. పురోగమన మార్గంలో కదిలింది.
గత పతనాలు విదిలించుకుని కదిలింది. రాలి
పోయిన ఆకుల క్రింద అణగి ఉన్న సమాధి
లోంచి లేచి వచ్చి కదిలింది మన కదిలిక
వల్ల యింకా కల కల్లాడుతుంది. అందుకు ఈ
నాటి మన ఆనందమే నాంది.

ముసలయ్య (తెర వెనుక)

కదిలిపోవుతరాల కలతలా పతనాలు
విదిలించి వెలుగులో కదిలింది నా పల్లె
కలిసి మెలిసిన బతుకు కరుగు మెత్తనిమనసు
శాంతి భావాలతో కదిలింది నా పల్లె ॥క॥

రంగు రంగుల ఆకు రాలి చిరుగాలిలో
రొద చేయు పాటలో కదిలింది నా పల్లె
ప్రగతి తళుకులతోడ పలకరించిన ప్రకృతి
ఎదలోన మెదలుతూ కదిలింది నా పల్లె ॥క॥



